శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 8



నంపెరుమాళ్, శ్రీరంగం



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అగ్ర శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీ పిళ్ళైలోకాచార్యులవారి వైభవమ్

లోకాచార్యగురవే కృష్ణ పాదస్య సూనవే,
సంసారభోగిసందష్ట జీవజీవాతవే నమః.

అల్పిశి మాసం శ్రవణా నక్షత్రంలో అవతరించిన, పరమకారుణికులైన ఈ ఆచార్యవర్యుల మహిమను కొంచెం అనుసంధానం చేసి ఆనందిద్దాం. వీరి జ్ఞానం, అనుష్ఠానం అనేవి ఒకవైపు ఉండగా, పరమ కరుణాప్రకారాన్ని ఏమని పొగడడం? ఆచార్యులు సామాన్యంగా రెండు విధాలుగా ఉంటారు. అనువృత్తిప్రసన్నాచార్యులు అని, కృపామాత్ర ప్రసన్నాచార్యులు అని అనేవి ఈ రెండు ప్రకారాలు. శిష్యులు అనేక పర్యాయాలు ప్రార్థించగా, అందువల్ల అనుగ్రహించేవారు అనువృత్తిప్రసన్నాచార్యులు అనబడతారు. శిష్యులనుండి ప్రార్థనను కొంచెం కూడా ఎదురు చూడకుండా, తమ సహజమైన భవ్యకృపతో తాముగానే అనుగ్రహించి, " పయనన్టాకిలుమ్ పాంగల్లరాకిలుమ్ శెయల్ నన్టాక త్తిరుత్తి పణికొళ్ళ్వాన్" (ఏ ప్రయోజనం లేకపోయినా, ఏ యోగ్యత లేకపోయినా, వృత్తం సరిగా ఉండేటట్లు సంస్కరించి, కైంకర్యాన్ని స్వీకరించడం కోసం) అనే విధంగా స్వయం ప్రయోజనంగా అనుగ్రహించేవారు అనువృత్తిప్రసన్నచార్యులు. మన ఆచార్య గోష్ఠిలో భగవద్రామానుజులే కృపామాత్ర ప్రసన్నాచార్యులు అనే పట్టాన్ని మొట్టమొదటగా పొందినవారు. అయినప్పటికీ, వారు సంప్రదాయ రహస్య వివరణ ఈ గ్రంథాన్ని దేనినీ అనుగ్రహించలేదు. బ్రహ్మసూత్రాల అర్థాలనే వివరించడానికి ప్రయత్నం చేసి, దానికి తగినట్లుగా గ్రంథాలను అనుగ్రహించారు. రహస్య త్రయార్థ వివరణ రూపాలైన ఏ గ్రంథాలను అనుగ్రహించినవారు, కారు. ఇంకొక రూపాన్ని ధరించి, అంటే, మణవాళ మహామునులుగా అవతరించి, అప్పుడు ఆ కార్యాన్ని నెరవేర్చాలి– అని భావించినవారు కనుక, శ్రీరామానుజులనే ఆ అవతారంలో రహస్య త్రయార్థాలను గ్రంథస్థం చేయకుండా, తమ అవతారాన్ని చాలించారు. . శ్రీ భాష్యం, గీతాభాష్యం

మొదలైన దివ్యగ్రంథాలలో సంప్రదాయ రహస్యార్థాలు అక్కడక్కడ నిక్షిప్తం చేయబడినప్పటికీ, వాటిని కరతలామలక న్యాయంలో స్పష్టంగా అనుగ్రహించని కొరత కొరతగానే మిగిలిపోయింది. ఆ కొరత తీరడం కోసం సర్వజ్ఞ సార్వభౌములైన శ్రీపిళ్లైలోకాచార్యులవారే మొట్టమొదటగా శ్రీవైష్ణవమండలికి మహోపకారాన్ని చేశారు. కనుక, లోకాచార్యులు అనే తిరునామం వీరికి చాలా తగినది. అజ్ఞానప్రదమైన ఈ లోకంలోని అజ్ఞానం అంతా తీరేటట్లుగా దివ్య సూక్తులను తేనె, పాలు, కలకండ, అమృతం అనే విధంగా ఉండే సూక్తులను అనుగ్రహించినవారు, ఈ మహాచార్యులు. వీరి సర్వజ్ఞత్వం, పరమ కారుణికత్వం, పరమప్రామాణికత్వం అనే వీని వైభవాలలో ఏ ఒక్కటి మనం మనసులో భావించటానికి గాని, నోటితో పలుకడానికి కాని మనకు శక్తి చాలదు కదా. ఏ అర్థంలోనూ ఆగ్రహం అనేది ఏమీ లేకుండా, ఆచార్య పరంపరా ప్రాప్తమైన అర్థాలనే అద్భుతంగా వివరించే అందం వీరి గ్రంథాలకే అసాధారణమైన చిహ్నం. వీరు అనుగ్రహించిన గ్రంథాలు అష్టాదశరహస్యాలు అనే పేరుతో లోకంలో ప్రసిద్ధిని పొందాయి.

# శ్రీకృష్ణుడే స్త్రీజనమానసంరక్షకుడు

భగవానుడైన శ్రీరాముడు ఒక స్త్రీ అయిన సీతాదేవి కోసం పలు ప్రయత్నాలను చేసి, లంకలో చెరలో ఉండే ఆమెను కాపాడాడు. అతడు ఏకదారావ్రతుడు. అందరికీ రక్షకుడు. పరభార్యలను కంటితో కూడా చూడనివాడు. ఈ విషయాలన్నీ మనకు తెలిసినవే. లోకప్రసిద్ధమైన విషయాలు, ఇవి.

భగవానుడైన శ్రీకృష్ణుడు "తాను స్త్రీలను రక్షించడం కోసమే అవతరించినవాడు" అనే విషయాన్ని లోకానికి అంతటికి తెలియజేసినవాడు. ఒక స్త్రీ చేసిన శపథాన్ని నెరవేర్చడం కోసమే చాలా తక్కువకార్యమైన దౌత్యాన్ని చేశాడు. అర్జునునకు సారథి అయ్యాడు. అందుకోసమే భగవద్గీతను అర్జునునకు ఉపదేశించాడు. ఏమి? ఆశ్చర్యంగా ఉన్నదా? కొంచెం గమనించి చూడండి. మీకే తెలుస్తుంది.

ద్రౌపది శపథం చేసింది. తనకు మానభంగం చేయడానికి ప్రయత్నం చేసినవాడు దుశ్శాసనుడు. "అతనిని కానీ, ఒక స్త్రీ అయిన తనను నిండు సభలో అవమానం చేయడానికి ప్రయత్నం చేసిన నూరుగురు అన్నదమ్ములను కానీ, వధించే తీరాలి. దుశ్శాసనుని రక్తాన్ని తన కురులకు పూసుకుంటే కానీ, విప్పుకున్న ఆ కురులను ముడివేసుకోను"– అని ద్రౌపది శపథం చేసింది. ఈ శపథాన్ని తప్పక పూర్తి చేయాలి. అప్పుడు చాలా వయసులో పెద్దవారు కానీ, జ్ఞానంలో పెద్దవారు కానీ, చివరికి రాజ్యాంగం కానీ, ఎవ్వరూ దానికోసం ముందుకు రాలేదు. ఏ ప్రయత్నం చేయలేదు. ఒక స్త్రీకి అవమానం జరిగితే, ఎవరినైనా ఎదిరించవచ్చు, ఎటువంటి ప్రయత్నాన్ని అయినా చేయవచ్చు, ఆ అకార్యం చేసినవారికి తప్పక తగిన దండన విధించి తీరాలి. అది చివరకు చాలా తీవ్రమైన దండన అయినా, మరణశిక్ష అయినా సరే, దోషం లేదు– అని కదా మనం శాస్త్రాల ద్వారా, పెద్దల ద్వారా తెలుసుకుంటున్నాము. అందువల్ల ద్రౌపదికి సహాయం జరగాలి. ఆమె శపథం నెరవేరాలి. దోషులు శిక్షింపబడాలి. అది ఆనాడు

అయినా సరే, ఈనాడు అయినా సరే. అది జరిగి తీరవలసిన న్యాయం. ఇప్పుడు, ఈ కాలంలో కూడా, ఏ స్త్రీ విషయంలోనైనా, అన్యాయంగా తప్పుగా ఎవరైనా ప్రవర్తిస్తే, వారిని అవమానం చేస్తే, ఆ అకార్యం చేసినవారికి తీవ్రమైన శిక్షణ విధించాలి– అని, సంఘంలో ఉండే న్యాయం చెప్పే పెద్దవారు కానీ, స్త్రీసంఘాలు కానీ, న్యాయజ్ఞులు ఎవరైనా కానీ, గట్టిగా వాదిస్తున్నారు కదా. చట్టం కూడా, "ఎవరైనా స్త్రీకి అన్యాయం చేయాలనే ప్రయత్నం చేస్తే తగిన దండన విధించాలి, అది చివరకు మరణశిక్ష అయినా తప్పులేదు" అని కదా, తెలుపుతున్నది. అందుచేత, ద్రౌపదికి న్యాయం జరగాలి, సహాయం జరగాలి, దోషులు శిక్షింపబడాలి. అయితే, ఈ పని ఎవరు చేయాలి? ఎవరు చేశారు? ధర్మపుత్రుడు "ధర్మం! ధర్మం! " అని అంటూ ఆభాసధర్మాన్ని పట్టుకున్నాడు. "అన్నగారి మాటను దాటకూడదు" అని అర్జునుడు మొదలైనవారు ఊరికే ఉండిపోయారు. అయితే, ఒక్క భీముడు మాత్రం "ద్రౌపదికి అన్యాయం చేసిన వీరిని వధించి తీరతాను"– అని అన్నాడు.

అయితే, ఆ సభలో ద్రౌపది ఎవరిని నమ్మలేద. ఎక్కడో ద్వారకలో ఉండే శ్రీకృష్ణుని నమ్మింది. అతనిని శరణాగతి చేసింది. "ద్వారకానిలయ! అచ్యుత! గోవింద పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్" అని వేడింది. ఆ శ్రీకృష్ణుడే ఆమెను ఆ ఆపద నుండి కాపాడాడు. తానున్న చోటు నుండి ఆమెకు వస్త్రధానాన్ని చేసి, ఆమె మాన సంరక్షణను చేశాడు. ఆ విధంగా ద్రౌపది ప్రార్థించిన సమయంలో ఆమెను రక్షించి, ఆమెకు న్యాయం చేసినవాడు, శ్రీకృష్ణుడు. ఆమెకు అవమానం జరగకుండా అడ్డుకున్నవాడు, శ్రీకృష్ణుడు.

అంతటితో అతడు ఆగలేదు. " ద్రౌపది నన్ను నమ్మింది. నన్ను శరణాగతి చేసింది. ఆమె శపథాన్ని నెరవేర్చాలి. ఇంతే కాక, ఒక స్త్రీకి అన్యాయం జరిగితే తప్పక తగిన దండన లభిస్తుంది– అనే విషయాన్ని లోకానికి తెలియాలి"–అని అతడు భావించాడు. నిజానికి శ్రీకృష్ణుడు కాక, ఇంకా ఎవరైనా ఒకరు దూతగా వెళ్లి ఉంటే, యుద్ధ

నివారణ జరిగి ఉండేదేమో! అందుచేత శ్రీకృష్ణుడే స్వయంగా పాండవ దూతగా వెళ్ళి, యుద్ధం కోసం ఇరుపక్షాలను ప్రేరేపించాడు. అర్జునునకు రథసారథి అయ్యాడు. శ్రీకృష్ణుడు కాకుండా వేరొకడు అర్జునులకు సారథి అయి ఉంటే, అర్జునుడు కోరిన విధంగా రథాన్ని నడిపి ఉండేవారు, సందేహం లేదు. కానీ, భీష్మద్రోణాదులను చూసి అర్జునుడు, "నేను యుద్ధం చేయను" –అని వెనుకంజ వేసినప్పుడు అతనిని అతడు యుద్ధానికి ప్రోత్సహించి ఉండేవాడా! అయితే, శ్రీకృష్ణుడు యుద్ధానికి వెనుకడుగును వేసిన అర్జునుని ప్రోత్సహిస్తూ, 700 శ్లోకాలు కలిగిన భగవద్గీతను అతనికి ఉపదేశించాడు. "నీవు యుద్ధం చేసి తీరాలి"–అని అన్నాడు. అర్జునుడు "సరే"అని అంగీకరించి, గాండీవాన్ని చేతబట్టి యుద్ధం చేశాడు, జయించాడు. ఈ విధంగా అర్జుననకు సారథియై, అతని యుద్ధానికి ప్రోత్సహించి, తాను ఏ ఆయుధాన్ని పట్టకుండా, యుద్ధాన్ని నిర్వహించి, ఒక స్త్రీ చేసిన శపథాన్ని సఫలం చేసినవాడు, శ్రీకృష్ణుడు.

ఈ సందర్భంలో వేరొక అంశాన్ని కూడా నిశితంగా గమనించి చూడాలి యుద్ధాన్ని ప్రోత్సహించడం కోసం అర్జునునకు శ్రీకృష్ణుడు గీతను బోధించాడు– అని అన్నాము కదా. ఇది నిజంగా ఆవశ్యకమైన యుద్ధమే కదా. ఈ యుద్ధం జరిగి ఉండకపోతే, ద్రౌపది శపథం నెరవేరి ఉండేదా? ఉండదు కదా. ఒక స్త్రీ చేసిన శపథం నెరవేరాలి కదా! అది కూడా ఒక బాధింపబడిన స్త్రీ చేసిన శపథం కదా. అది నెరవేరాలి కదా! అందుకోసమే శ్రీకృష్ణుడు ఇన్ని విధాలైన ప్రయత్నాలను చేశాడు. ఆ బాధ్యతను అంతటినీ తన తలకు ఎత్తి కొన్నాడు శ్రీకృష్ణుడు. దూతగా వెళ్ళాడు, రథసారథి అయ్యాడు, గీతను బోధించాడు. అధర్మాన్ని చేసిన అందరూ నశించారు. ఈనాడు మనం "ఒక స్త్రీకి అన్యాయం చేసినవారికి శిక్ష తప్పక విధింపబడాలి" అని అంటున్నామే! దానిని నెరవేర్చినవాడే, శ్రీకృష్ణుడు. అందుకోసమే భగవద్గీతను బోధించాడు. అందుచేత, భగవద్గీత యుద్ధాన్ని ప్రోత్సహించే శాస్త్రం–అని అన్నా తప్పు లేదు కదా. ఈయుద్ధం ఆవశ్యకమే కదా. అది జరిగితే కదా అవమానింపబడిన స్త్రీ చేసిన శపథం నెరవేరినట్లు అవుతుంది. దీనిని అంతా గమనించే, శ్రీకృష్ణుడు వీటిని అన్నిటిని చేశాడు. ద్రౌపదికి

జరిగిన అవమానాన్ని తీర్చడం కోసం శ్రీకృష్ణుడు ఎన్ని ప్రయత్నాలు, ఎంతగా చేశాడో కదా! యుద్ధంలో చివరకు వధింపబడిన దుశ్శాసనుని రక్తాన్ని తన కురులకు పూసుకొని, వాటిని ముడివేసుకుని, తన శపథాన్ని ద్రౌపది తీర్చుకున్నది. సఫలం చేసుకున్నది. ద్రౌపది అవమానాన్ని తీర్చి, ఆమె చేసిన ప్రతిజ్ఞను శ్రీకృష్ణుడు నెరవేర్చిన వృత్తాంతం, ఇది.

ఇక, ఉత్తరాదేవి విషయం. ఈమె అభిమన్యుని భార్య. అశ్వత్థామ ప్రయోగించిన అస్త్ర ప్రభావంచేత ఆమె గర్భంలోని శిశువుకు ఆపద సంభవించింది. ఆమె కూడా శ్రీకృష్ణుని శరణాగతి చేసింది. అప్పుడు శ్రీకృష్ణుడు శంఖచక్రాయుధ సహితుడై ఆమె దగ్గరకు వెళ్లి, ఆమెను రక్షించాడు. ఆమె గర్భంలోనే శిశువుకు హాని జరగకుండా కాపాడాడు. ఆ విధంగా ఒక స్త్రీ చేసిన ప్రార్థనకు తగినట్లు ఆమె గర్భంలోని శిశువును రక్షించి, ఆమె దుఃఖాన్ని తీర్చినవాడు, శ్రీకృష్ణుడు. వివాహిత అయిన ద్రౌపదికి జరిగిన అన్యాయాన్ని తీర్చినవాడు, శ్రీకృష్ణుడు. గర్భవతి అయిన ఉత్తర గర్భానికి ఏర్పడిన ఆపదను తీర్చి కాపాడినవాడు, శ్రీకృష్ణుడు.

ఇంత మాత్రమే కాదు, రుక్మిణీకల్యాణ వృత్తాంతాన్ని గమనిద్దాం. రుక్మిణికి కల్యాణం కాని కన్య. ఆమె శ్రీకృష్ణుని ఆశ పడినది, అతనిని వివాహం చేసుకోవాలని అనుకున్నది. అయితే, ఆమె మనోరథథానికి విరుద్ధంగా, ఆమె సోదరుడు రుక్మి అన్యాయంగా దుర్మార్గుడైన శిశుపాలునకు ఆమెను ఇచ్చి వివాహం చేయాలని ప్రయత్నించాడు. దానిని చూచి సహించలేక, రుక్మిణి ఏడు శ్లోకాలతో కూడిన ఒక లేఖను శ్రీకృష్ణునకు పంపుతూ, తనను రక్షించమని, తనను వివాహం చేసుకోమని శరణాగతి చేసింది. శ్రీకృష్ణుడు ఆ లేఖను చూశాడు. ఆమె శరణాగతిని స్వీకరించాడు. ఒకే రాత్రిలో ద్వారకా నగరం నుండి విదర్భదేశానికి వచ్చి, రుక్మిణి దేవిని తన రథంలో కూర్చుండబెట్టుకొని, తనను ఎదిరించిన అందరినీ జయించి, ఆమెను వివాహం చేసుకొని, ఆమె మనోరథాన్ని తీర్చాడు. ఆ విధంగా వివాహం జరగని, తనను ఆశపడిన

కన్య చేసిన ప్రార్థనను మన్నించి, ఆమెను కాపాడి, వివాహం చేసుకొన్నవాడు కూడా, శ్రీకృష్ణుడే.

వివాహిత అయినప్పటికీ, తనకు అన్యాయం జరిగేటప్పుడు, తన భర్తలు సైతం రక్షించలేని స్థితిలో ద్రౌపదిని కాపాడినవాడు, శ్రీకృష్ణుడు భర్తను కోల్పోయి, తన బిడ్డకు ఆపద సంభవించేటప్పుడు, ఉత్తర చేసిన ప్రార్థనను మన్నించి ఆమెను రక్షించినవాడు, శ్రీకృష్ణుడు. ఆమె కుమారుని రక్షించి, ఆమె వంశక్రమాన్ని కాపాడినవాడు, శ్రీకృష్ణుడు. కన్య అయిన రుక్మిణి శరణాగతిని మన్నించి, ఆమె మనోరథాన్ని తీర్చినవాడు, శ్రీకృష్ణుడు. ఈ విధంగా, స్త్రీలకు జరిగిన అన్ని విధాలయిన అన్యాయాలను తీర్చి, వారిని కాపాడినవాడు శ్రీకృష్ణుడే. ఆ స్వామి విషయంలో శరణాగతి చేసినవారు కోరినది ఏమి నెరవేరదు? ఈ విషయాన్ని శ్రీకృష్ణుడే స్వయంగా ద్రౌపదికి ఈ విధంగా తెలియజేశాడు. " ద్యౌః పతేత్ పృథివీ శీర్యేత్ హిమవాన్ శకలీ భవేత్, శుష్యే త్తోయనిధిః కృష్ణే! న మే మోఘం వచో భవేత్" – "ద్రౌపదీ! ఆకాశం ఏనాడూ కింద పడదు, అయినా, అది పడినప్పటికీ, భూమి ఏ నాడూ బ్రద్దలు కాదు, అది బ్రద్ధలు అయినప్పటికీ, హిమవత్ పర్వతం ఏ నాడూ పొడిపొడి కాదు, అది ఆ విధంగా అయినప్పటికీ, సముద్రం ఏ నాటికీ ఎండిపోదు, అది ఎండిపోయినప్పటికీ, నా మాట మాత్రం వ్యర్థం కాదుసుమా!, ఏనాడూ వట్టిపోదు. నిన్ను రక్షించే తీరుతాను". అని అన్నాడు, శ్రీకృష్ణుడు

ఈ విధంగా శ్రీకృష్ణుడు స్త్రీజనసంరక్షకుడై, సకలాత్ములకు రక్షకుడై, " నమ్ కణ్ణల్లదు ఇల్లై ఓర్ కణ్ణే" (మన శ్రీకృష్ణుడు తప్ప వేరొకడు ఎవరూ రక్షకుడు కాడు) అని ఆళ్వారులు పలికినట్లుగా, మన శ్రీకృష్ణుడే స్త్రీజనమాన సంరక్షకుడు, మనకు అందరికీ రక్షకుడు. వేరొకరు ఎవ్వరూ రక్షకులు కానే కారు. ఈ సత్యాన్ని గుర్తిద్దాం. అందరికీ తెలియజేద్దాం. అందరం ఆ శ్రీకృష్ణుని ఆశ్రయిద్దాం. తరిద్దాం.

# ఈ మూడు మనకు సమకూడాలి

ముదలాళ్వార్లలో రెండవ ఆళ్వారులు పూదత్తాళ్వార్. వీరు తమ ప్రబంధం ఇరండామ్ తిరువందాదిలోని ఒక పాశురంలో ఆశ్చర్యాన్ని కలిగించే మూడు పదాలను ఉపయోగించి, మనకు ఒక ఆవశ్యకమైన ఉపదేశాన్ని చేస్తున్నారు.

"ఉఱ్ఱు వణంగి త్తొ౯్ఱుమిన్ ఉలగే౯్ఱుమ్ ముఱ్ఱుమ్ విఴుఙ్గుమ్ ముగిల్ వణ్ణన్" అని ఆరంభమవుతున్నది, ఆ పాశురం. ఇందులో "ఉఱ్ఱు వణంగి త్తొ౯్ఱుమిన్" అనే మూడు పదాల ద్వారా మనకు వారు ఉపదేశాన్ని చేస్తున్నారు. ఆళ్వారులు తమ ప్రబంధాలలో మనకు ఉపదేశాన్ని చేస్తారు. తమ ఉపదేశానికి తగినట్లుగా తాము ఆచరిస్తూ, భగవంతుని ఆశ్రయిస్తారు, భగవదనుభవాన్ని పొంది ఆనందంగా పాశురాలను గానం చేస్తారు. ఈ పాశురంలో " ఉఱ్ఱు వణంగి త్తొ౯్ఱుమిన్" అని మనకు ఉపదేశం చేస్తున్నారు ఇందులోని స్వారస్యాన్ని కొంచెం గమనిద్దాం.

"ఉఱ్ఱు" అంటే– భగవంతుని దరిచేరి, సమీపించి –అని అర్థం. "వణంగి త్తొ౯్ఱుమిన్"– "వణంగి" అంటే– మీ అహంకారాన్ని, గర్వాన్ని అంతటినీ విడచిపెట్టి, వినమ్రులై, "త్తొ౯్ఱుమిన్"– అంజలిని చేయండి, చేతులను జోడించి నమస్కరించండి ఆ భగవంతుని శరణంగా ఆశ్రయించండి – అని అర్థం. "ఉఱ్ఱు వణంగి త్తొ౯్ఱుమిన్" అనే ఈ మూడు పదాలు చాలా ముఖ్యమైనవి, నిశితంగా గమనించదగినవి.

ఇక్కడ "వణంగి" అన్నా, "తొ౯్ఱుమిన్" అన్నా ఒకటే అర్థం వస్తుంది కదా! ఇవి రెండూ ఒకే అర్థాన్ని ఇచ్చే పదాలు కదా! అని మనకు పైపైన చూచినప్పుడు తోచవచ్చు. " వణంగి" అంటే– చేతులను జోడించి, నమస్కరించడం, " తొ౯్ఱుదల్" అన్నా, చేతులను జోడించడమే కదా– అని తోస్తుంది. అయితే, మరి ఆల్వార్లు ఏ కారణం చేత "వణంగి త్తొ౯్ఱుమిన్" అని ఒకే అర్థాన్ని ఇచ్చే రెండో పదాలను ఉపయోగించారు? అనే సందేహం కలుగుతుంది.

కానీ, ఇక్కడ వాస్తవం అది కాదు. ఇక్కడ "వణంగి" అనే పదానికి అహంకారాన్ని, గర్వాన్ని విడచి, వినమ్రతను పొంది—అని అర్థం. వాస్తవంలో కూడా "అయ్యా! వణక్కమ్" అని అంటే—" కేవలం చేతులను జోడించి నమస్కరిస్తున్నాను" అని అర్థం కాదు. మీ విషయంలో నేను వినమ్రతను కలిగినవాడను— అని కదా అర్థం. మనలో ఉండే గర్వం, అహంకారం అంతా తొలగి, నమస్కరిస్తున్నాను— అని అర్థం. లేకపోతే, అది ఆభాసమైన నమస్కారమే అవుతుంది. "వణక్కమ్" అనే పదానికి ద్రావిడ నిఘంటువులలో "విధేయత" అనే అర్థం స్పష్టంగా చెప్పబడింది. "వణంగలిల్ అరక్కన్"అని రావణుని గూర్చి ఆళ్వార్లు ప్రయోగిస్తారు. " న నమేయం హి కస్యచిత్" – నేను ఎవరికీ విధేయుడను కాదు, నమస్కరించను – అని అహంకారంతో, గర్వంతో పలికినవాడు కదా, రావణుడు. ఆ విధంగా ఇక్కడ "వణంగి"అంటే— మనసులో ఉండే గర్వం, అహంకారం అంతా పోగొట్టుకొని, భగవంతుని శరణంగా నిశ్చయించుకుని – అని భావం. అంతే తప్ప, చేతులను జోడించి నమస్కరించడాన్ని తెలుపదు. ఆ విధంగా, గర్వాన్ని, అహంకారాన్ని పోగొట్టుకొని, తొழுమిన్— అంజలిని చేయండి, ఆశ్రయించండి— అని తరువాత అంటున్నారు. భగవంతుని శరణంగా నిశ్చయించుకోవడం, చేతులను జోడించి, నమస్కరించడం— అనే ఇవి రెండు వేరు వేరు కదా.

ఇక్కడ ఇంకో విషయం కూడా గమనించాలి. " వణంగి త్తొழுమిన్" అని ఆళ్వార్లు పలికినందున, మనసులో ఉండే గర్వాన్ని అహంకారాన్ని విడచిపెట్టకుండా కేవలం పైపైకి మాత్రం చేతులను జోడించేవారు ఉండవచ్చు— అని తెలుస్తుంది. "ఆ విధంగా గర్వాన్ని, అహంకారాన్ని విడిచిపెట్టకుండా చేసే నమస్కారం వల్ల, అంజలి వల్ల ఏ ప్రయోజనం లేదు" అని కూడా ఇక్కడ చెప్పినట్లయినది. ఆ విధంగానే, లోపల ఉండే గర్వం, అహంకారం తొలగినా, చేతులను జోడించి నమస్కరించకపోవచ్చు. ఆ విధంగా ఉన్నా, ప్రయోజనం లేదు— అని కూడా ఇక్కడ సూచింపబడింది. మనసులో ఉండే

గర్వం, అహంకారం తొలగిపోవాలి, ఆ విధంగా ఆ రెండు తొలగిపోయి, వినమ్రభావం కలిగిన విషయం సూచింపబడే విధంగా చేతులను జోడించి నమస్కరించాలి– అని ఇక్కడ ఆళ్వార్ల హృదయం. అందుచేత, "వణంగి త్తొ ళ్ళుమిన్" అనే ఈ రెండు పదాలు ప్రత్యేకంగా ప్రయోగింపబడ్డాయి.

"*ఉఱ్ఱు* వణంగి త్తొ ళ్ళుమిన్" అని అళ్వార్లు ప్రయోగించిన పదాలను మరొక్కసారి గమనించి చూద్దాం. "*ఉఱ్ఱు*" అనే ప్రయోగించినందున, భగవంతుని దరి చేరకుండా, ఎక్కడో ఉండి నమస్కరించవచ్చు –అని దీనివల్ల స్ఫురిస్తున్నది. అయితే, దీనివల్ల కూడా ప్రయోజనం లేదు భగవంతుని సమీపించాలి. శారీరకంగా భగవంతుని దరి చేరడం మాత్రమే కాదు, మానసికంగా కూడా భగవంతునకు దగ్గర కావాలి. ఒక్కొక్కసారి భగవత్ సమీపానికి శారీరకంగా చేరలేకపోవచ్చు. ప్రస్తుత కాలంలో, తిరుమలలో ఉండే స్వామిని దర్శించడం అనేది ఎంతో దూరం నుండి దర్శించే పరిస్థితి ఏర్పడుతున్నది. ఆ విధంగా భగవంతుని దగ్గరకు శారీరకంగా చేరలేకపోయినా, మానసికంగానైనా దగ్గరకు కావడం చాలా ముఖ్యం. అందుచేత, ఇక్కడ "*ఉఱ్ఱు*" అనే పదానికి మానసికంగా భగవంతుని దగ్గరకు చేరడంలోనే ముఖ్యమైన దృష్టి. మానసికంగా వీలైనంత శారీరకంగా భగవంతుని దగ్గరకు చేరి, మనసులో ఉండే గర్వాన్ని అహంకారాన్ని పూర్తిగా తొలగించుకొని, వినమ్ర భావాన్ని పొంది, భగవంతుడే శరణం–అనే నిశ్చయాన్ని ఏర్పరచుకొని, ప్రీతితో, భక్తితో చేతులను జోడించి ఆ భగవంతుని నమస్కరించండి– అనేది అళ్వార్లు ప్రయోగించిన ఈ మూడు పదాలలోని తాత్పర్యం. ఈ మూడు విధాలైన స్థితులు కలగడం అనేది చాలా అరుదు కనుకనే, ఆళ్వార్లు భగవంతుని విషయంలో ఈ మూడిటిని పొంది, మీరు తరించండి– అని మనకు పూదత్తాళ్వారులు ఉపదేశిస్తున్నారు. వారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా వారి ఉపదేశాన్ని మరొక్క మారు స్మరించుకుందాం. అనుసరించి తరిద్దాం.

## కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగ ప్రకారాలు

కర్మయోగం అని, జ్ఞానయోగం అని, భక్తియోగం అని ప్రసిద్ధంగా చెప్పబడే యోగాలు మూడు. ఈ మూడిటిలో, ఒక్కొక్కటి రెండు రెండు విభాగాలను కలిగి ఉంటాయి. కర్మలో రెండు ప్రకారాలు, జ్ఞానంలో రెండు ప్రకారాలు, ఆ విధంగానే, భక్తిలో కూడా రెండు ప్రకారాలు ఉంటాయి. అవి ఏవి? ఏ విధంగా ఉంటాయి? వాటి ప్రయోజనాలు ఏమి?అని కొంచెం గమనిద్దాం.

మనం ఏ విధమైన కర్మను చేసిన, అందులో, కర్మ విభాగం అని, జ్ఞాన విభాగం అని రెండు విభాగాలు ఉంటాయి. అది ఏవిధంగా? అంటే– మనం కోవెలకు పోయి, ప్రదక్షిణం చేస్తున్నామనుకోండి. కాళ్లతో నడిచి వెళ్లి ప్రదక్షిణం చేయడం అనేది కర్మ విభాగం ఆ పని ఎందుకోసం చేస్తున్నాము? అని, అది భగవత్కైంకర్య బుద్ధితో చేస్తున్నాము –అని తెలుసుకోవడం జ్ఞాన విభాగం. ఈ విధంగా కర్మలో– కర్మ విభాగం, జ్ఞాన విభాగం– అని రెండు ప్రకారాలు ఉంటాయి.

ఈ రెండిటిలో ఏది ప్రధానమైనది ?గొప్పది? అని అంటే, జ్ఞాన విభాగమే గొప్పది. "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" అని అంటూ గీత ఆచార్యుడు" చేసిన ప్రతి కర్మ జ్ఞాన ప్రకారంలోనినికి పరిసమాప్తి చెందుతుంది"– అని అంటాడు. అంటే, చేసిన కర్మలు అన్నీ చివరికి జ్ఞానంలోకి పరిణమిస్తాయి అందుచేత, కర్మ విభాగం కంటే జ్ఞాన విభాగమే ప్రధానమైనది. గొప్పది.

తరువాత, జ్ఞానం విషయంలో చూద్దాం. జ్ఞానంలో కూడా రెండు విభాగాలు ఉన్నాయి. ఒకటి ఆత్మకు సంబంధించిన జ్ఞానం, రెండవది పరమాత్మకు సంబంధించిన జ్ఞానం. మనం ఎవరం? ఎటువంటి స్వరూపం కలిగినవారం? అని తెలిసికోవాలి. పరమాత్మ ఎవరు? ఇటువంటి స్వరూపం కలిగినవాడు? అని కూడా తెలుసుకోవాలి. ఆత్మకు సంబంధించిన జ్ఞానాన్ని తెలిసికొనేటప్పుడు, ఆత్మ అనేది శరీరం కంటే వేరైనది

అని గ్రహించాలి. ఆత్మ దేహం కంటే విలక్షణమైనది, ఆత్మ నశించనిది శరీరం నశించే స్వభావం కలిగినది ఆత్మ జ్ఞానం కలిగినది శరీరం జ్ఞానహీనమైనది —అని ఈ విధంగా ఆత్మకు, శరీరానికి మధ్య ఉండే భేదాలను వివేకించి తెలుసుకోవాలి. ఈ విధంగా కలిగే జ్ఞానం మనకు సంబంధించిన జ్ఞానం. అంటే, ఆత్మకు సంబంధించిన జ్ఞానం. మనం ప్రకృతి కంటే, అంటే, శరీరం కంటే ఉన్నతమైనవారం అని తెలుసుకున్నాము. కానీ, ఈ ఆత్మకు సంబంధించిన జ్ఞానం పొందినంతలో మాత్రం చాలదు. ఎందుకంటే, ఈ జ్ఞానంతో మాత్రం నిలిచిపోతే, అది గర్వంలోకి, అహంకారంలోకి పర్యవసిస్తుంది. నేను గొప్పవాడను, ప్రకృతి కంటే ఉన్నతమైనవాడను, జ్ఞానం కలిగినవాడను— అని మాత్రమే కదా గ్రహించాము. ఆత్మ శరీరం కాదు, ఆత్మ ప్రాణవాయువు కాదు, ఇంద్రియాలు ఆత్మ కాదు, మనసు ఆత్మ కాదు — అనే విధంగా చెప్పేటప్పుడు, తెలుసుకునేటప్పుడు, మనకు సహజంగానే గొప్ప వారం— అనే గర్వం కలుగుతుంది, అహంకారం ఏర్పడుతుంది కదా.

అందుచేత, అదే సమయంలో, వేరొక విధమైన, పరమాత్మకు సంబంధించిన, వివేకించి తెలుసుకోవలసిన జ్ఞానం ఉన్నది. మనం నిత్యమైనవారం, జ్ఞానం కలిగినవారం— అని మాత్రమే కాక, మనం భగవంతునకు శేషభూతులం, ఆయన కైంకర్యానికి ఉపయోగపడవలసినవారం— అనే జ్ఞానాన్ని కూడా పొందాలి. ఈ జీవుడు తాను స్వయంగా ఏ విధంగానూ తనకు తానుగా నిలువలేడు. తన లోపల అంతర్యామిగా ఉండే పరమాత్మ సంకల్పం చేతనే తన అన్ని విధాలైన స్థితులను కలిగి ఉన్నాడు— అని తెలుసుకోవడమే జ్ఞానంలోని రెండవ విభాగం.

మరి, ఈ రెండు విధాలైన జ్ఞానప్రకారాలలో ఏది శ్రేష్ఠమైనది? అని ఆలోచిస్తే, కలిగే జ్ఞానం ఆత్మ పర్యంతంగానే పర్యవసిస్తే, అది గర్వంలోకి, ఆహంకారంలోకి పరిణమించి, మిగిలిపోతుంది, నిలిచిపోతుంది. కానీ, పరమాత్మనుకూడా తెలిసిన వారం అయితే, అప్పుడు మన స్వరూపాన్ని, భగవంతుని స్వరూపాన్ని రెండిటిని తెలుసుకున్నవారం కాగలము. భగవంతునికే మనం చెందినవారం, ఆయనకే ఉపయోగపడవలసినవారం—

అని గ్రహించినవారం అవుతాము. అందుచేత పరమాత్మకు సంబంధించిన జ్ఞానమే గొప్పది.

ఈ విధంగా, ఇంతవరకు, కర్మలో ఉండే రెండు ప్రకారాలను, జ్ఞానంలో ఉండే రెండు ప్రకారాలను గమనించాము.

ఇక, చివరిది, మూడవది భక్తి. ఇది కూడా రెండు విధాలైన ప్రకారాలను కలిగి ఉన్నది. జ్ఞానదశ, ప్రేమ దశ –అని ఆ రెండు ప్రకారాలు. ఆత్మకు సంబంధించిన జ్ఞానం, భగవంతునకు సంబంధించిన జ్ఞానం– అనేది ఒక ప్రకారం. అయితే, ఆ జ్ఞానం కేవలం రిక్తమైన జ్ఞానం అయితే చాలదు, ఆర్ద్రత లేని జ్ఞానం అయితే సరిపోదు. ప్రయోజనం లేదు. అందువల్ల, అది ప్రేమతో కలిసి ఉండాలి. ఆ విధంగా ప్రేమతో కూడిన జ్ఞానం అయినప్పుడు అది భక్తి అవుతుంది. ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తిః" అని కదా చెప్పబడుతున్నది. "ఞానమ్ కనింద నలమ్ కొండు నాడొరుమ్ నైబవర్ క్కు వానమ్ కొడుప్పదు మాదవన్" (భక్తిగా పండిన జ్ఞానంతో నిత్యం కొలిచేవారికి మాధవుడు వైకుంఠాన్ని అనుగ్రహిస్తాడు) అని శ్రీరంగామృత కవి అంటారు. అంటే, ఇక్కడ జ్ఞాన విభాగం ఒకటి. అంటే, ఆత్మకు, పరమాత్మకు సంబంధించిన జ్ఞానవిభాగం ఒకటి ఉన్నది. ఆత్మ ఎవరు? పరమాత్మ ఎవరు? ఆత్మ –పరమాత్మకు ఏ విధంగా శేషభూతుడు? ఆయనకే ఉపయోగపడవలసినవాడు? అనే జ్ఞానం. రెండవది. . అదే భగవంతుని విషయంలో ప్రేమగా పరిణమించి, ముక్తిని కలిగిస్తుంది.

ఈ విధంగా ఉండే జ్ఞానదశకు, ప్రేమ దశకు వేరు వేరు ప్రయోజనాలుకూడా ఉన్నాయి. మనం ముక్తిని పొందడానికి మనకు అడ్డుగా ఉండేవి– పుణ్య పాపరూపమైన కర్మలు. ముక్తిని పొందాలంటే ఇవి తొలగిపోవాలి. దానికి జ్ఞానం ఉపయోగపడుతుంది. జ్ఞానం అనేది క్రమక్రమంగా వృద్ధి చెందితే, కర్మలు నశిస్తాయి. శ్రీకృష్ణుడు భగవద్గీతలో "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్" అని అంటాడు. జ్ఞానం అనేది జలించే నిప్పు వంటిది. దాని

ప్రభావం వల్ల మన పాపాలు అనే ముక్తివిరోధులు నశిస్తాయి. అందుచేత, భక్తిలో ఉండే జ్ఞానప్రకారం అభివృద్ధి చెంది, అగ్ని వలె జ్వలించి, మన పాపాలను దూదిపింజలను వలె, బూడిద చేస్తాయి. ఇది జ్ఞానప్రకార ప్రయోజనం.

రెండవది ప్రేమ ప్రకారం. ఇది ఏ విధమైన ప్రయోజనాన్ని కలిగిస్తుంది? భగవంతునకు, ఆ భగవంతుని భక్తులకు ప్రీతితో సేవను చేయడంలో ఇది మనలను పురికొల్పుతుంది. ప్రేమ అని అనగానే, తప్పకుండా అది సేవ చేయడంలోకే పరిణమిస్తుంది. తల్లికి, తన బిడ్డపై గల ప్రీతి, ప్రేమ ఆ బిడ్డకు ఆమె సేవ చేసేటట్లుగా చేస్తుంది కదా. భార్యకు తన భర్త పై ఉండే ప్రేమ ఆమెను అతనికి సేవ చేసేటట్లు పురి కొల్పుతుంది కదా. ఆ విధంగానే, మనకు భగవంతుని విషయంలో ఉండే ప్రీతి ఆ స్వామికి అన్ని విధాలయిన సేవలను మనం చేసేటట్లు పురి కొల్పుతుంది. ఇక్కడ, భగవంతుని సేవ చేసేటట్లు ప్రేరేపిస్తుంది అని అనగానే, ఆ స్వామికి శరీర భూతులైన, మిక్కిలి ప్రీతిపాత్రులైన భక్తులందరినీ కూడా సేవించేటట్లుగా ఈ ప్రీతి ప్రేరేపిస్తుంది– అనేది స్పష్టం కదా. ఆ విధంగానే, భగవంతునితో శరీర శరీరి భావరూపమైన సంబంధం కలిగినవారు కనుక, ఈ లోకంలోని జీవులందరి విషయంలోనూ మనం ప్రేమను చూపించగలుగుతున్నాము. సహాయపడుతున్నాము. అందుచేత, ఈ ప్రేమ ప్రకారం కైంకర్యంలోకి మనలను ప్రేరేపిస్తుంది. జ్ఞాన విభాగం మనం చేర్చి, పేర్చి పెట్టుకున్న అనాదికర్మలను దహిస్తుంది. ఇవే ఈ రెండు ప్రకారాల ప్రయోజనాలు.

ఈ విధంగా, కర్మయోగ, జ్ఞాన యోగ, భక్తి యోగాలు అనే మూడిటిలో ఉండే మూడు మూడు ప్రకారం ఏవి? వాటి వివరం ఏమి? వాటి ప్రయోజనాలు ఏమి? అనేది తెలిసికొన్నాం. తెలుసుకుంటే చాలదు కదా. వాటిని మనం ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిద్దాం. స్వస్తి.

# భగవద్రామానుజదర్శనం

(ఉ. వే. శ్రీమాన్ ఎస్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా) సమర్పణ – దాసుడు ఈ. ఏ. శింగరాచార్యులు.

## *1) అవతారిక*

అనాది అయిన వేదానికి మూడు విధాలయిన వివరణలను వరుసగా ఆదిశంకరులు, శ్రీరామానుజులు, శ్రీ మధ్వాచార్యులు అనే ముగ్గురు ఆచార్యులు ప్రవర్తింపజేశారు. వీరు ముగ్గురిలో, ఆదిశంకరులు కేరళదేశంలోనూ, శ్రీ రామానుజులు తమిళనాడులోను, మధ్వాచార్యులు కర్ణాటకదేశంలోనూ అవతరించారు వీరు ముగ్గురు స్థాపించిన అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాలు అనే మూడు దర్శనాలను ఈనాటికి భారతదేశం అంతా లక్షలాది జనులు ఆదరించి, అనుసరిస్తున్నారు. వీరిలో శ్రీరామానుజులే ద్రావిడ దేశంలో అవతరించారు. చాలా ప్రాచీనమైనదిగా కీర్తింపబడే తొండ మండలానికి చెందిన శ్రీ కేశవ సోమయాజికి, భూమిదేవికి ఏకైక సంతానంగా శ్రీ రామానుజులు అవతరించారు. సంస్కృత వేదాలను, ద్రావిడ భాషలోని వేదాలయిన ఆళ్వారుల దివ్య ప్రబంధాలను సమన్వయం చేసి, సంఘకాలం నుంచి ద్రావిడ దేశంలో ప్రకాశించిన రెండు భాషలలోని సాహిత్యాల సమన్వయ మార్గమైన విశిష్టాద్వైతం అనబడే శ్రీవైష్ణవ దర్శనాన్ని శ్రీరామానుజులు సుస్థాపించారు. ఈ విధంగా దక్షిణభారతానికి –ఉత్తర భారతానికి, ద్రావిడ భాషకు –సంస్కృత భాషకు మధ్య సమన్వయకర్తగా ఈ మహానుభావులు వెలిగారు.

వీరి మతంలోని, తెలియదగిన, ముఖ్యమైన అర్థ విశేషాలు సంగ్రహంగా ఇపుడు తెలియజేయబడుతున్నాయి. లోకంలో ఉండే అన్ని వస్తువులు చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు వర్గాలలోకి అంతర్భవిస్తాయి. వీటిలో, చిత్తు, లేక, చేతనుడు అనే వస్తువు జ్ఞానాన్ని కలిగిన జీవుడు. అచిత్తు, లేక, అచేతనం అనేది జ్ఞానం లేని వస్తువు. చేతనులైన జీవులు లెక్కలేనంతమంది. అచేతనమైన వస్తువులు కూడా

లెక్కలేనివి. వాస్తవమైన, యథార్థమైన వస్తువులైన వీనిని అన్నిటిని తనను విడచి ఉండని, ఉండలేని శరీరంగా కలిగినవాడై ఉండే శ్రీమన్నారాయణుడే ఈశ్వరుడు. అతడే పరతత్వం. సత్వం, రజస్సు, తమస్సు– అని అనబడే మూడు గుణాలను కలిగిన మూల ప్రకృతి అనే అచేతన వస్తువు యొక్క వికారమైన ఈ లోకం అంతా ఆ నారాయణునిచే ఆ యా సమయాలలో సృష్టించబడి, రక్షించబడి, లయం చేయబడుతున్నది. అతని అంతు లేని లీలకు విషయం అవుతున్నందున్నందున ఇది లీలా విభూతి అని చెప్పబడుతున్నది. ఈ లీలా విభూతిలో ఉండే జీవులు పుణ్య పాపాలచే కట్టుబడి ఉండేవారై, బద్ధులు అని అనబడతారు. నిత్యంగా నిలచి ఉండేదై, రజోగుణాన్ని, తమోగుణాన్ని కలవని శుద్ధసత్వగుణం కలిగిన పరమపదం అనే శ్రీవైకుంఠం అనే లోకం – నారాయణుడనే ఆ స్వామికి ఎల్లప్పుడూ వశమై ఉండే లెక్కలేనంతమంది నిత్య సూర్యుల చేత, ఈ లీలా విభూతి నుండి ఒకానొక సమయంలో ముక్తిని పొందిన, లెక్కలేనంతమంది ముక్తుల చేత నిండి ఉన్నందున, నిత్యవిభూతి అని కీర్తింపబడుతున్నది. విభూతి అనే పదానికి సంపద అని అర్థం. ఈ రెండు లోకాలు పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుని సంపద కనుక, ఉభయ విభూతులు అని అనబడుతున్నాయి.

లీలావిభూతిలో ఉండే బద్ధచేతనులు నిత్యవిభూతిని చేరి, శ్రీమన్నారాయణుని అనువర్తించి సేవించడమే పరమమోక్షం అని సంస్కృత శాస్త్రాలలోనూ, "నల్వీడు" అని ఆళ్వారుల చేతను చెప్పబడుతున్నది. జీవులు ఈ మోక్షం అనే ప్రాప్యాన్ని పొందడానికి తెలియవలసినవి ఐదు విషయాలు. అవి ఏవి? అంటే, 1) లోకాన్ని అంతటినీ సొత్తుగా కలిగినవాడైన భగవంతుని స్వరూపం, 2) అతని సొత్తులలో ఉన్నతమైన, జీవులు అనే మనలను గూర్చిన స్వరూపం, అంటే, యథార్థమైన స్థితి, అంటే, ఆత్మ స్వరూపం, 3) వైకుంఠాన్ని చేరి మనం పొందే ఫలమైన ఉజ్జీవనం, 4) ఈ ఫలాన్ని పొందడానికి ఉపాయమైన మార్గం, 5) ఇంతవరకు మనలను ఈ ఉజ్జీవనాన్ని పొందనివ్వకుండా

అడ్డుపడిన విరోధులు— అనే ఈ ఐదు విషయాలను గూర్చి శ్రీ రామానుజులు చూపిన మార్గాన్ని అనుసరించి, క్రమంగా ఐదు శీర్షికలలో వివరింపబడుతున్నాయి.

*2) ఈశ్వర స్వరూపం*

భగవద్రామానుజ మతంలో ఈశ్వరుని స్వరూపం ఇప్పుడు వివరింపబడుతున్నది. ఈశ్వరుడైన శ్రీమన్నారాయణుడు అన్ని దోషాలకు ప్రత్యనీకుడు సద్గుణాలకు అన్నిటికీ ఆకరమైనవాడు. తనకంటే వేరైన సకల చేతనులను, అచేతన వస్తువులను తనను విడిచి ఉండని శరీరంగా కలిగి ఉన్నందున, అన్నీ తానే"— అని చెప్పేటట్లుగా ఉన్నవాడు. అయినప్పటికీ, శరీరమై ఉండే వాటి దోషాల చేత ఎంత మాత్రం స్పృశింపబడనివాడై ఉండేవాడు. అన్ని కాలాలలోనూ అన్ని చోట్ల వ్యాపించి ఉండేవాడు. జ్ఞానానందాలను స్వరూపంగా కలవాడు. సహజమైనవి, అంతు లేనివి అయిన జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు, సౌలభ్యం, వాత్సల్యం, మార్దవం, సౌహార్దం, సమత్వం, కరుణ, మాధుర్యం, గాంభీర్యం, ఔదార్యం, బలం, ధైర్యం, శౌర్యం, పరాక్రమం, సత్యసంకల్పత్వం, సర్వశక్తిత్వం, భక్తుల కార్యాన్ని తన కార్యంగా తలచే స్వభావం, కృతజ్ఞత్వం మొదలైన అంతులేని కళ్యాణ గుణాలను కలవాడు. ఈ కళ్యాణ గుణాలను వ్యక్తం చేయడం కోసమే లెక్కలేనన్ని రూపాలను పరిగ్రహించేవాడు. తనకు ఇష్టమైనదై, తగినదై, కాలం చేత ఎటువంటి మార్పును పొందనిదై, భావించడానికి సాధ్యం కానిదై, అప్రాకృతమైన శుద్ధసత్వద్రవ్యాలతో ఏర్పడినదై, ఎల్లప్పుడూ ఉండేదై, ఏ దోషం లేనిదై, సాటి లేని తేజస్సును కలిగినదై, సౌందర్య, లావణ్య, సౌగంధ్య, మార్దవ, నిత్య యౌవనాది లెక్కలేనన్ని గుణాలకు ఆకరమై ఉండేది —ఈ స్వామి తిరుమేని. కర్మ కారణంగా ఏర్పడే, ప్రాకృతమైన, హేయమైన శరీరాల కంటే అది చాలా విలక్షణమైనది. భక్తులకు అనుగ్రహించడం కోసం ఈశ్వరుడైన తనచే కోరి పరిగ్రహింపబడినది, అప్రాకృతమై ఉండేది ఇతని పరంజ్యోతి రూపం. ఆ తిరుమేనిలో చాలా అందమైన పలు ఆభరణాలు, శంఖం, చక్రం మొదలైన దివ్యాయుధాలు ఉన్నాయి. చేతనులను ఈశ్వరునితో చేర్చడమే స్వభావంగా కలిగినది కనుక, చేతనులకు అందరికి తల్లియై,

నారాయణునకు ఎల్లప్పుడూ వశమై ఉండడం చేత ఆ స్వామికి అప్రాకృతమైన పత్నియై ఉండే లక్ష్మీదేవిని, ఆమెకు వశంగా ఉండే భూదేవి మొదలైనవారిని దివ్య పత్నులుగా కలవాడు. పరమపదంలో ఈశ్వరునికే ఎల్లప్పుడూ కైంకర్యం చేస్తూ ఉండే ఆదిశేషుడు, గరుడుడు మొదలైన, లెక్కలేనంతమంది నిత్య సూరులను, ముక్తులను కలవాడు. ఇటువంటి గొప్పతనాన్ని కలవాడై, పరమపదం అని, వైకుంఠం అని వేద వేదంతాలలో పొగడబడే, పైన అంతు లేని అప్రాకృతమన నిత్యవిభూతిలో ఉంటూ, ఆ విభూతిని పాలించేవాడు. ప్రాకృతమైన, ప్రకృతి, పురుషులు అనబడే జీవులు, కాలం– అనే మూడు విధాలయిన తత్వాలతో నిండిన, అంతు లేని లీలా విభూతి అనబడే ఈ లోకాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఈ లోకంలో కర్మ కట్టుబడి ఉండే జీవులను సంస్కరించి, పరమపదానికి తీసుకుని పోవడం కోసం వేదం మొదలైన శాస్త్రాలను అనుగ్రహించి, రాముడు, కృష్ణుడు మొదలైన లెక్కలేనన్ని అవతారాలను ఎత్తేవాడు. ఆలయాలలో అర్చారూపంగా వేంచేసి ఉండేవాడు. ఆళ్వార్లు, ఆచార్యులువంటి జ్ఞానులను ఈ లోకంలో అవతరింప చేసేవాడు. ఈ లోకంలో ఉండే జీవులను సంస్కరించి, వారి నుండి కైంకర్యాన్ని స్వీకరించడం కోసమే ఏ సోమరితనం లేకుండా ఈ లోకాన్ని సృష్టించి, రక్షించి, లయం చేస్తూ, అవతరించి, అద్భుతమైన లీలలను చేస్తూ ఉండేవాడు. ఇతడు ఈ విధంగా చేయడానికి కారణం ఏమంటే, లోకానికి అంతటికి ఇతడు స్వామియై, ఆధారమై, నియమించేవాడై, రక్షకుడై ఉండడమే. మిక్కిలి జ్ఞాన శక్తులను కలిగిన బ్రహ్మ శివుడు మొదలైన దేవతలు కూడా ఇతనిచే సృష్టింపబడి, పాలింపబడి, లయం చేయబడే జీవులే. తనతో సమమైనవారు, మించినవారు ఎవరూ లేని ఆదిపరంజ్యోతియై ఉండేవాడు. నారాయణుడు, విష్ణువు, హరి, అనంతుడు మొదలైన లెక్కలేనన్ని నామాలను కలిగినవాడు. వాస్తవంగా లోకంలో ఉండే అన్ని వస్తువుల పేర్లు వాటికి అంతర్యామి అయిన ఇతని నామాలే అవుతున్నాయి. అందుచేత ఏ నామంతో అయినా వేదాలు, జ్ఞానులు ఇతనిని నిర్దేశిస్తారు. తనచే సృష్టింపబడిన వస్తువులకు తన పేర్లను కొన్నిటిని ఇతడు అనుగ్రహించాడు. అయినా, నారాయణుడు మొదలైన వేలాది సంఖ్యలోని నామాలను తనకు విలక్షణ నామాలుగా కలిగి ఉండేవాడు. అందుచేతనే ఈ

నామాలతో ఇతనిని పిలువడంలో జ్ఞానులు మిక్కిలి ఆసక్తిని, ఆర్తిని కలిగి ఉంటారు. ఈ గొప్పతనాలు అన్ని ఇతనికి ఉన్నాయని వేదం మొదలైన సంస్కృత భాషలోని శాస్త్రాలు, ఆళ్వార్ల దివ్య ప్రబంధాలు సంఘకాల సాహిత్యానికి చెందిన పరిపాడల్ మొదలైన గ్రంథాలు తెలియజేస్తున్నందున, ఈ శ్రీరామానుజ దర్శనం చాలా ప్రాచీనమైన దర్శనం అని తెలుస్తున్నది.

### *3) జీవస్వరూపం*

శ్రీ రామానుజ దర్శనంలో జీవుల స్వరూపం ఇక వివరింపబడుతున్నది జీవులందరికీ తండ్రియై, రక్షకుడై, శేషియై, స్వామియై, నాయకుడై, తెలియదగినవాడై, స్వామియై, ఆధారమై, ఆత్మయై అనుభవించేవాడై ఉండే, ఈశ్వరుడైన శ్రీమన్నారాయణునకు— సంతానమై, రక్షింపబడేవాడై, దాసుడై, నాయకియై, తెలిసేవాడై, సొత్తై, ధరింపబడేవాడై, శరీరమై, అనుభవింపబడేవాడై ప్రతి జీవుడు ఉన్నందున, ఈ జీవులందరూ ఈశ్వరునితో ఇటువంటి తొమ్మిది విధాలైన సంబంధాలను సహజంగా కలిగినవారై ఉన్నారు. జీవుడు, ఈశ్వరుని వలె నిత్యంగా ఉండేవాడు. దేహం, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణం అనబడే జడపదార్థాల కంటే చాలా విలక్షణుడు. ఆ యా ఆత్మకు "నేను, నేను" అని ఎల్లప్పుడూ ఆత్మ భాసిస్తుంది. ఈ ఆత్మ సహజంగా జ్ఞానమయం కనుక, ఆనందమయంగా కూడా ఉంటుంది. అంతటా వ్యాపించదగిన ధర్మభూత జ్ఞానాన్ని కలిగినది. ముక్తిదశలో దీని జ్ఞానం అంతటా వ్యాపిస్తుంది. అయినా, ప్రాకృతమైన శరీరంతో కల సంబంధం చేత ఈ లీలా విభూతిలో ఉండే జీవులకు వారు వారు చేసిన పూర్వకర్మల వల్ల ఏర్పడిన శరీర సంబంధంచేత హెచ్చుతగ్గులు ఏర్పడుతున్నాయి. భగవంతునకు, అతని భక్తులకు శేషమై ఉండడమే సహజ స్వరూపంగా ఈ ఆత్మ కలిగి ఉన్నది. నిత్యమైన ఆత్మకు అనాదికాలంగా పలు విధాలైన శరీరాలతో అతడు చేసిన పూర్వకర్మల కారణంగా సంబంధం ఏర్పడుతున్నది. జన్మ, దాని సంబంధం నశించేటప్పుడు మరణం కలుగుతున్నట్లు లోకంలో వ్యవహరింపబడుతున్నది. కాని, వాస్తవానికి ఆత్మస్వరూపానికి జన్మ

మరణాలు లేవు. ఆత్మ అణుపరిమాణాన్ని కలిగినదై, శరీరం మధ్యలో ఉండే హృదయంలో ఉంటుంది. కన్ను మొదలైన ఇంద్రియాలకు కనిపించదు కనుక, భౌతిక వస్తువులను తెలిసికన్నట్లుగా ఆత్మను తెలుసుకోవడం వీలు కాదు. అణువై, హృదయంలో ఉన్నప్పటికీ, దీపం అనేది తన ప్రకాశంతో తానున్న గది అంతా వ్యాపించేటట్లుగా, ఆత్మ అనేది తన ధర్మభూతజ్ఞానంతో శరీరంలో అంతటా వ్యాపిస్తున్నది. శరీరంలో ఏర్పడే సుఖదుఃఖాలను చర్మం, నోరు, కన్ను, ముక్కు, చెవి, మనసు అనే జ్ఞానేంద్రియాల మూలంగా తెలసికొంటున్నది. మొదట తెలిపిన ఐదు జ్ఞానేంద్రియాలతోనూ వాక్కు, చేతులు, కాళ్లు, మలద్వారం, స్త్రీపురుష చిహ్నాలై ఉండే ఉపస్థ అనే ఐదు కర్మేంద్రియాలతో మనసు మూలంగా సంబంధాన్ని పొంది స్పృశించడం, వాసనను గ్రహించడం, చూడడం, రసానుభవాన్ని పొందడం, వినడం మాటలాడడం, బరువును ఎత్తడం, నడవడం మొదలైన కార్యాలను జీవుడు చేస్తున్నాడు. ఆత్మ అనబడే జీవుడు ఈ విధంగా తెలుసుకొనే జ్ఞాతయై, కార్యాలను చేసే కర్తయై, అనుభవించే భోక్తయై ఉంటున్నాడు. ఈ విధంగా ఉండేటప్పుడు కూడా ఈశ్వరుని అధీనంలోనే ఉంటున్నాడు. అయినప్పటికీ, మొదటి ప్రయత్నంలో ఇతని స్వాతంత్ర్యం భగవంతుడు ఇస్తున్నాడు కనుక, సత్కర్మ దుష్కర్మలకు సుఖదుఃఖాలను ఫలంగా ఇతనికి ఇవ్వడం చేత భగవంతునకు ఏ విధమైన పక్షపాతం, కరుణారహిత్యం వంటి దోషాలు ఏవీ ఏర్పడడం లేదు. ఆత్మలు –ఎల్లప్పుడూ కర్మ సంబంధం లేని నిత్య సూరులు అని, ఒక సమయంలో కర్మ సంబంధం తీరిన ముక్తులు అని, కర్మచేత, దాని కారణంగా ఏర్పడే శరీరం చేత బంధింపబడేవారైన బద్ధులు అని మూడు విధాలుగా ఉంటారు. ఒక్కొక్క విధంగా ఉండే జీవవర్గం అంతు లేని సంఖ్యలో ఉంటుంది. మొదట చెప్పబడిన రెండు వర్గాలకు చెందినవారైన నిత్యులు, ముక్తులు నిత్యవిభూతిలోనూ, మూడవ వర్గానికి చెందినవారైన బద్ధులు ఈ లోకంలోనూ ఉంటారు. ఇటువంటి ఈ మూడు విధాలైన జీవులకు జడ వస్తువైన ప్రాకృతదేహం యొక్క సంబంధం చేత అజ్ఞానం మొదలైన దోషాలు ఏర్పడుతున్నాయి. ఈ దేహ సంబంధం పూర్తిగా తొలగిపోయేటప్పుడు వీరు ముక్తులు అవుతున్నారు. ఏ సమయంలో కూడా వీరు

ఈశ్వరునితో ఏకం కావడం లేదు. అతనితో సమానమైన పలు మహిమలను కలిగినవారై, ప్రాకృతదేహ సంబంధం వల్ల కలిగే దోషాలను లేనివారై, తిరిగి ఏ నాడు ప్రాకృతమైన దేహంతో సంబంధం ఏర్పడని ఉన్నతమైన దశను పొందుతున్నారు. శాస్త్రాలలో అచేతన వస్తువులను ఈశ్వరునితో ఒకటిగా వ్యవహరించినట్లుగా, చేతనుడైన జీవునికూడా భగవంతునితో ఏకం చేసి వ్యవహరించడం కూడా ఎందువల్ల జరుగుతున్నది? అని అంటే, ఈశ్వరుడు అన్నిటికీ ఆత్మగాను, మిగిలినవి అన్నీ అతని విడచి ఉండడానికి వీలు కాని రీతిలో అవి శరీరమై ఉన్నందుచేతనే ఆ విధంగా ఒకటిగా వ్యవహరింపబడుతున్నవి. అందుచేత, సంసారదశలోవలె మోక్ష దశలో కూడా జీవుడు పరబ్రహ్మతో ఏ నాడు ఒకటి కావడం లేదు. ఇది ఆత్మకు సంబంధించిన, రామానుజ దర్శనానురూపమైన స్వరూపం.

### *4) ఉపేయస్వరూపం*

భగవద్రామానుజ దర్శనంలో ఉజ్జీవనం అనబడే ముక్తిదశ ఎటువంటిది ?అని ఇక వివరింపబడుతున్నది. ఆత్మ అనబడే జీవుడు ఈశ్వరుడైన శ్రీమన్నారాయణుని కృప చేత ప్రాకృతమైన దేహసంబంధాన్ని పోగొట్టుకొని, నిత్యవిభూతి అనే పరమ పదాన్ని చేరి, తాను కోరిన ఉజ్జీవనాన్ని పొందడం ముక్తిదశ అని అనబడుతున్నది. ఆత్మ అనేది పరమపదాన్ని చేరి, జ్ఞానానందమయమైన తన ఆత్మ స్వరూపాన్నే, శరీరం లేకుండా, సదా ఒంటరిగా ఉండి, అనుభవించడమనే కైవల్యం అనబడే చాలా నీచమైన మోక్షాన్ని గాని, లేక, భగవంతుడైన శ్రీమన్నారాయణుని చేరి, అప్రాకృత శరీరాన్ని పొంది, అంతు లేని మహానందాన్ని భగవద్భక్తులైన నిత్యముక్తులతో కలసి ఉండి, అతనిని దర్శించి ఆనందించి, మహానందాన్ని పొందడం, ఆ స్వామికి కైంకర్యం చేసి బ్రహ్మానందాన్ని పొందడం, ఆస్వామి ఆనందమే ప్రయోజనంగా కలిగినవారై, అతనికి సేవ చేసి అతని ముఖోల్లాసాన్ని చూచి, ఆనందాన్ని పొందడం, అతని భక్తుల ఆనందమే ప్రయోజనంగా కలిగినవారై, వారికి సేవ చేసి, వారి ముఖోల్లాసాన్ని చూచి, మహానందాన్ని పొందడం— అనే వీటిలో తాను కోరిన ఒక దానిని పొందే ఉన్నతమైన మోక్షాన్ని కానీ ఈ లోకంలో తాను

కోరినట్లు పొందుతున్నాడు– అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. చాలా ఉన్నతమైన ఈ మోక్షం అనే సాయుజ్యమే పరమమోక్షం– అని, "నల్వీడు" అని వ్యవహరింపబడుతున్నది. నిత్యసూరులకువలె ఈ లోకంలో ఉండే బద్ధ జీవులకు కూడా ఇటువంటి మోక్షాన్ని అనుగ్రహించి, తాను ఆనందించాలి– అనే ఆశతోనే శ్రీమన్నారాయణుడు ప్రళయ కాలంలో సూక్ష్మమైన మూల ప్రకృతి అనే అచేతన వస్తువులతో కలసి, జ్ఞానం లేకుండా పడి ఉండే జీవులకు సృష్టి కాలంలో స్థూలమైన శరీరాన్ని, ఇంద్రియాలను అనుగ్రహించి, తనను తెలియజేసే శాస్త్రాలను ప్రసాదించి, తాను కూడా ఈ లోకంలో అవతరించి పడరాని పాట్లు పడి, జ్ఞానులను ఈ లోకంలో అవతరింప చేస్తున్నాడు. ఇటువంటి మోక్షాన్ని పొందగోరితే, దీనిని పొందడానికి ఒక్కొక్క జీవునకు పొందే యోగ్యత ఉన్నది– అని చెబుతున్నది, రామానుజ దర్శనం. ఈ మోక్షాన్ని పొందడానికి తగిన పలు పలు దశలుగానే లోకంలో ఉండే అన్ని దర్శనాలను భగవానుడు సృష్టి చేశాడు– అనేది భగవద్రామానుజ దర్శనంలోని అభిప్రాయం. పరమపదంలోని శ్రీమన్నారాయణునకు, అతని భక్తులకు సేవ చేసి మహానందాన్ని పొందే ఉజ్జీవనాన్ని పొందడం కోసం ముక్త జీవుడు భగవంతుని మనోరథాన్ని అనుసరించే తన మనోరథానుసారంగా అప్రాకృతమైన శరీరాన్ని పరిగ్రహిస్తున్నాడు. భగవంతుని తిరుమేనివలె ఈ ముక్తశరీరం కూడా నిత్యవిభూతిలో ఉండే శుద్ధసత్వాన్ని కలిగిన అచేతన వస్తువులతోనే ఏర్పడుతున్నది సత్వం, రజస్సు, తమస్సు –అనే మూడు గుణాలను కలిగిన ప్రాకృత శరీరం వలె ఈ ముక్తరీరం జీవుని జ్ఞానానందాలను అడ్డుకోదు. ఈ శరీరంతో అన్ని చోట్లలో, అన్ని కాలాలలో, అన్ని స్థితులలోనూ తగిన అన్ని విధాలైన కైంకర్యాలను భగవంతునకు ముక్తానంద దశను పొందిన జీవుడు చేస్తున్నాడు. ఇదే జీవస్వరూపానికి తగిన ఉజ్జీవనం. ఈ కైంకర్యాన్ని కూడా దాసుడైన తన ఆనందం కోసం –అని భావించి చేయకుండా, స్వామి అయిన భగవంతుని ఆనందం కోసమే –అని భావించి చేయాలి. . సంసార మండలంలో ఉండేటప్పుడు భగవంతుని ఆనందం కోసమే అయిన కైంకర్యాన్ని చేయాలని ఆశపడేవారికే ఈ ఉజ్జీవనం లభిస్తుంది– అనే విషయాన్ని" తనక్కే యాక ఎనై క్కొళ్ళుక్క మీదే ఎనక్కే కణ్ణనై యాన్ కొళ్ శిఱప్పే" అని

నమ్మాళ్వారులు, " ఉనక్కే నామ్ ఆట్చెయ్వోమ్" అని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోనూ తెలియజేశారు. "తనకు సొత్తు అయిన జీవుని పొంది తాను ఆనందించాలి" అనేదే స్వామి అయిన ఈశ్వరుని ఆశ కనుక, ఈ జీవుడు మోక్షంలో కూడా తన ఆనందాన్ని లక్ష్యంగా గ్రహించకుండా, భగవంతుని ఆనందాన్నే లక్ష్యంగా గ్రహించడం చాలా గొప్పది. ఇటువంటి మోక్షాన్ని భగవంతుడు అందరికీ నిర్బంధించి ఇవ్వడు. ఎవరు ఇటువంటి దాస్యాన్ని చెయ్యాలని ఆశపడుతున్నారో, వారికే దీనిని భగవంతుడు అనుగ్రహిస్తున్నాడు. అందుచేత ఈ దాస్యం, ఈ లోకంలో యోగ్యత లేనివారికి చేసే దాస్యం వలె, దుఃఖాన్ని కలిగించేదిగా కాకుండా, జీవులకు అన్ని విధాలైన సంబందాలను కలవాడై ఉండే భగవంతుని విషయంలో ఆ స్వామి ఆనందం కోసం చేయబడేది కనుక, మహానందమయంగా ఉంటుంది. రామానుజ దర్శనానుసారం జీవులకు ముక్తిని అనుగ్రహించడానికి శక్తి కలవాడు, ప్రాప్తి కలవాడు శ్రీమన్నారాయణుడే. మోక్షాన్ని అనుగ్రహించగలిగినవాడు పురుషోత్తముడే—అని పురుష సూక్తం, మోక్షాన్ని జనార్ధనుని వల్లనే పొందాలి— అని ఋషులు, " ఎరుత్తుక్కొడి యుడైయానుమ్ పిరమనుమ్ ఇందిరనుమ్ మ*ఱ్ఱు*మ్ ఒరుత్తరుమ్ ఇప్పిఱవి ఎన్నుమ్ నోయ్ క్కు మరుందఱివార్ ఇల్లై మరుత్తువనాయ్ నిన్ఱ మామణివణ్ణా" (గొప్ప వైద్యుడవైన ఓ మణివర్ణా! ఎద్దును ధ్వజంగా కలిగిన శివుడు, ఇంద్రుడు, బ్రహ్మ, ఇంకా ఎవ్వరూ కూడా ఈ జన్మ అనే వ్యాధికి తగిన మందు ఏదో తెలిసినవారు లేరు) అని పెరియాళ్వార్లు పలికిన అర్థాన్నే ఈ విషయంలో శ్రీరామానుజులు బలపరచారు— అని తెలుస్తున్నది.

### *5) ఉపాయస్వరూపం*

భగవద్రామానుజ దర్శనంలో ముందు ప్రస్తావించిన మోక్షఫలాన్ని పొందడానికి మార్గం అనబడే ఉపాయాన్ని గురించి ఇక వివరించబడుతున్నది. లోకంలో ఉండే మతాలు అన్నిటిలోనూ జీవులు ముక్తి అనే మహానందాన్ని పొందడానికి ప్రయత్నం చేసే దారులు తెలుపబడినవి. ఆ క్రమంలోనే భగవద్రామానుజులు కూడా తమ శ్రీభాష్యం, గీతా భాష్యం మొదలైన గ్రంథాలలో— జీవులు మోక్షానందాన్ని తాము పొందడానికి

కర్మజ్ఞానయోగాలను అంగంగా కలిగిన భక్తి యోగాన్ని సాధనంగా అనుష్ఠించాలి– అనే వేదశాస్త్ర నిర్ణయాన్ని తెలియజేశారు. జీవులు అందరూ ఉజ్జీవించడానికి దారి అయిన శరణాగతి మార్గాన్ని గద్యత్రయం అని ప్రసిద్ధి పొందిన మూడు గ్రంథాలలో శ్రీ రామానుజులు తెలియజేశారు. ఈ శరణాగతి మార్గాన్నే శ్రీ రంగనాథుని సన్నిధిలో పంగుని మాసం ఉత్తరా నక్షత్రం చేరిననాడు అనుగ్రహింపబడిన ఈ మూడు గద్యలలో తాము తమకోసం, తమతో సంబంధం కలిగినవారి కోసం అనుష్ఠించి చూపించారు. దీని భావాన్ని కొంచెం వివరిస్తాను.

తన సొత్తు అయిన జీవుని పొంది తాను ఆనందించాలి– అనేది భగవంతుని ఆశ. అందుకోసం అతడు సృష్టించడం, అవతరించడం మొదలైన అనేక ప్రయత్నాలను అనాదికాలంగా చేస్తూనే ఉన్నాడు. కానీ, జీవులు అయితే, అనాదికాలంగా తాము చేసిన పాపాల ఫలంగా తమకు భగవంతునకు మధ్య ఉండే సహజమైన సంబంధాన్ని తెలియలేకుండా, భగవంతుడు ఇచ్చిన స్వతంత్రమైన జ్ఞానంతో అల్పమై, అస్థిరమై ఉండే ఈ లౌకిక సుఖాలనే కోరి, అన్వేషించి వాటికోసం పరుగులు తీస్తున్నారు. పలు దర్శన మార్గాలను చూపించి, పలు జన్మలలో వీరిని క్రమక్రమంగా సంస్కరించి, చివరిలో తనను పొందడమే మోక్షం–అని వీరికి భగవంతుడు తెలియజేస్తున్నాడు. అప్పుడు కూడా జీవుడు ఆ మోక్షాన్ని పొంది, ఆనందాన్ని పొందాలని కోరితే, పలు జన్మలలో కర్మజ్ఞాన భక్తియోగాలను సాధనంగా అతనిచే అనుష్ఠింపజేసి, . చివరివరకు మోక్షంలోనే ఆనందాన్ని పొందాలని కోరి, జీవుడు తన ప్రయత్నంలోనే నిలచి ఉన్నట్లయితే, ఆ సాధన ఫలంగా మోక్షానందాన్ని అతనికి భగవంతుడు ప్రసాదిస్తున్నాడు.

కొందరు జ్ఞానులు అయితే ఈ క్రింది విధంగా భావిస్తున్నారు "భగవంతుడు మనతో సహజంగా సంబంధాన్ని కలవాడు. మనలను పొంది తాను ఆనందించటానికి అనాదికాలంగా పడరాని పాట్లను పడుతున్నాడు. మనం చూస్తే, మనం ఆనందాన్ని పొందడం కోసం అనాదికాలంగా పాట్లు పడుతున్నాము. వాస్తవంలో మనలను పొంది,

భగవంతుడు పొందే ఆనందమే మనం పొందదగిన ప్రాప్యం అవుతున్నది. మనం మన ఆనందం కోసం ప్రయత్నం చేయడమనేదే —భగవంతుడు నిర్హేతుకంగా మనలను అనుగ్రహించి, మనలను తనను పొందేటట్లు చేయడానికి ఈ నాటి వరకు ఆటంకంగా ఉన్నది. మనం, మనకోసం ఆనందాన్ని పొందడాన్ని లక్ష్యంగా కలిగినవారమై, ఇక్కడ మనం అందుకోసం ప్రయత్నించడం నుండి విరమించి, ఆ భగవంతుని ఆనందమే ముఖ్య లక్ష్యంగా గ్రహించి, అతడు మనలను రక్షించేవాడని నిశ్చయించుకొని, అతనికోసం, అతని భక్తులకు కోసమే మన జీవించినట్లయితే, అతడు మనకు పరమపురుషార్థాన్ని అనుగ్రహించడం కోసం మన వద్ద ఎటువంటి ప్రయత్నాన్ని ఎదురు చూడకుండా, నిర్హేతుకంగా మనకు మోక్షాన్ని ఈ జన్మ చివరలో అనుగ్రహించి, అతని ఆనందం కోసమే అయిన కైంకర్య రూపమైన పరమపురుషార్థాన్ని అనుగ్రహిస్తాడు" అని ఈ విధంగా ఆ జ్ఞానులు భావిస్తారు. దానికి తగినట్లు తాము మోక్షం పొందడం కోసం తామే స్వయంగా ప్రయత్నం చేయడం నుండి విరమించి, అతనినే పొందదగిన ప్రాప్యంగాను, అతనినే తనను పొందించే ఉపాయంగాను నిశ్చయించుకొని, అతని కోసమే ఈ జన్మలో జీవించి, పరమపదంలో అతనికి కైంకర్యం చేసే పరమపురుషార్థరూపమైన ఉజ్జీవనాన్ని ఏ సాధనానుష్ఠానం లేకుండానే నిర్హేతుకంగా పొందుతున్నారు. వీరికి భగవంతుడే మోక్షోపాయం అవుతున్నాడు. ఇటువంటి వారే ప్రపన్నులు అని, శరణాగతులు అని చెప్పబడుతున్నారు. వీరి జీవన విధానమైన శరణాగతి మార్గమే చాలా గొప్పదైన మోక్ష మార్గం అని గద్యత్రయంలో భగవద్రామానుజులు ఆచరించి చూపించారు. " "కణ్ణనల్లాల్ ఇల్లై కండీర్ శరణ్" (శ్రీకృష్ణుడు కాకుండా ఇంకొక శరణం ఏదీ మనకు లేదు) అని నమ్మాళ్వారులు చూపించిన మార్గం ఇదే. ఇటువంటి రీతిలో భగవంతుని ఉపాయంగాను, ఉపేయంగాను నిశ్చయించుకొని, జీవనాన్ని సాగించడానికి చేతకానివారు అటువంటి నిశ్చయాన్ని ఒక ఆచార్యుని అభిమానానికి పాత్రమై పొంది, జీవించినట్లయితే, దానివల్ల కూడా పరమ పురుషార్థరూపమైన మోక్షాన్ని చాలా సులభంగా పొందవచ్చు— అని భగవద్రామానుజులు ఉపదేశించారు. ఇదే మధురకవి ఆళ్వారులచేత "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అనే దివ్య ప్రబంధంలో చూపబడిన అనాది

అయిన మార్గం. ఈ అనాది మార్గం ద్వారా తరువాతి కాలంలో ఉండేవారు కూడా ఉజ్జీవించడం కోసం 74 మందిని ఆచార్య పీఠాధిపతులుగా తమ శిష్యులలో ఉత్తములైనవారిని నియమించి, పరంపర పరంపరగా ఈ మార్గాలను వ్యాపింప చేయడం కోసం శ్రీరామానుజులు ఏర్పాటు చేశారు. " లోకంలో ఉండే జీవులందరూ పరమపురుషార్థరూపమైన మోక్షాన్ని పొంది ఉజ్జీవించాలి" అనే గొప్ప కరుణతో ఆళ్వారులను అనుసరించి, చాలా సులభమైన దారులను అన్ని కాలాలకు తగినట్లుగా తీర్చిదిద్ది అనుగ్రహించిన శ్రీరామానుజులను " కారేయ్ కరుణై ఇరామానుశ" అని (మేఘం వలె గొప్ప ఔదార్యాన్ని కలిగిన భగవద్రామానుజా!) అని అంటూ ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో శ్రీరంగామృత కవి ప్రశంసించడం అతిశయోక్తి కాదు కదా.

*6) విరోధిస్వరూపం*

పరమపురుషార్థరూపమైన మోక్షానందాన్ని ఈ లోకంలో ఉండే జీవులు పొందడంలో అడ్డుగా ఉండే విరోధులను గూర్చి రామానుజ దర్శనం ఏ విధంగా తెలియజేసిందో ఇప్పుడు తెలియజేయబడుతున్నది. భగవంతునివలెనే నిత్యమై ఉండే ఈ లోకంలో ఉండే జీవులకు అనాదికాలంగా ఉండే ప్రాకృతమైన శరీరాలతో ఉండే సంబంధం చేత తమను గూర్చిన యథార్థమైన జ్ఞానం ఆవరింపబడి, వారికి తెలియడానికి సాధ్యం కాకుండా ఉన్నది. అందుచేత వీరు దేహాన్ని ఆత్మగాను, తమను స్వతంత్రులుగాను భావించి పాడవుతున్నారు. ఇది అవిద్య, లేక, అజ్ఞానం అని అనబడుతున్నది. ఈ అజ్ఞానం చేత వీరు అల్పమై, అస్థిరమైన ఈ లోకంలోని ఆనందాలను కోరి, వాని కోసం పరుగులు తీసి, వాటిని పొందడం కోసం మంచి పనులను, చెడ్డ పనులను చేస్తున్నారు, భగవంతుడు వీరికి ఇచ్చిన స్వతంత్రమైన జ్ఞానంతో వీరు చేసే పుణ్యకార్యాలతో భగవంతునికి వీరి పట్ల ప్రీతి, చెడ్డ పనుల వల్ల వీరి విషయంలో కోపం కలుగుతున్నది. ఆ ప్రీతి అనేది పుణ్యం అని చెప్పబడుతున్నది. దీనివల్ల వీరు కోరే ఈ లౌకిక సుఖాలను వీరికి భగవంతుడు అనుగ్రహిస్తున్నాడు. ఒక్కొక్క జీవుడు అనాదికాలంగా లెక్కలేనన్ని పుణ్య పాపాలను చేర్చి పెట్టుకుంటున్నాడు. అవి ఇంకా ఇంకా ఇతనిని లౌకిక సుఖాలనే

కోరేటట్లు చేసి, వాటిని పొందడం కోసం మంచి పనులను, చెడ్డ పనులను చేసేటట్లుగా ప్రేరేపించి, ఒకటికి నూరు రెట్లు, వేయి రెట్లుగా పుణ్య పాపాలను పెంచుకునేటట్లు చేస్తున్నది. దీనివల్ల ఈ లోకంలోని సుఖాలలోనే వాసన అనబడే అలవాటు ఈ జీవునకు కలుగుతున్నది. వానినే ఇంకా ఇంకా కోరేటట్లు చేసే రుచి ఏర్పడుతున్నది. ఈ విధంగా శృంఖలా న్యాయంగా కలిగే శరీర సంబంధం, అజ్ఞానం, పుణ్య పాపకర్మలు, వాసన, రుచి అని మొదలైనవి ఇతనికి ఇంకా ఇంకా పలు జన్మలను, వాటిలో పలు శరీరాలతో సంబంధాన్ని కలిగిస్తూనే ఉన్నవి. అవిద్య అనబడే అజ్ఞానం, కర్మ, వాసన, రుచి, ప్రకృతి సంబంధం అనబడే శరీరంతో ఉండే సంబంధం మొదలైనవి మనలను గూర్చి, భగవంతుని గూర్చి తెలిసికోవడానికి వీలు లేని విధంగా మనలను చేస్తున్నాయి. ఇవే మనం పరమపురుషార్థాన్ని అనాదికాలంగా పొందనీయకుండా అడ్డుపడే విరోధులు. ఇవి నాస్తికవాదం మొదలైనవానిని చేసి, భగవంతుని విషయంలో అపచార పడేటట్లుగాను, అతని భక్తుల విషయంలో అపచారపడేటట్లుగాను, అతనిని, అతని భక్తులను చాలా ద్వేషించేటట్లుగాను కూడా చేస్తున్నాయి. ఇవి భగవంతుని పొందడానికి చాలా పెద్ద ఆటంకాలు అవుతున్నాయి. ఈ విధంగా లెక్కలేనన్ని విరోధులు ఉన్నప్పటికీ, భగవంతుడు తాను చేసే ప్రయత్నంతో, తమ కార్యాలతో ఈ జీవులకు ఏర్పడే పుణ్య పాపాలను ఒకటికి పది రెట్లు నూరు రెట్లుగా వృద్ధి అయ్యేటట్లు చేసి, పుణ్యాలతో పాపం తగ్గివారిని తనను తెలిసికొనేటట్లు చేస్తున్నాడు. అతనిని తెలిసికొని, పూర్వం తెలిపిన మార్గాలలో కొంతమంది జీవులు ఇంతకు ముందు ప్రస్తావించిన విరోధులను పూర్తిగా తీర్చుకొనగలిగి, తాము కోరిన ముక్తిదశను పొందుతున్నారు— అనేది రామానుజ దర్శన ప్రకారం. ఈ విధంగా ఈశ్వర స్వరూపం, జీవస్వరూపం, ప్రాప్యస్వరూపం, ఉపాయస్వరూపం, విరోధిస్వరూపం— అనే వీటిని గూర్చ రామానుజ దర్శనం ఏ విధంగా తెలియజేసిందో గమనించాం.

### *7) ఉపసంహారం*

భగవద్రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు తొమ్మిది. వేదవ్యాసమహర్షించిన బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానమై వెలసిన శ్రీభాష్యం, వేదాంత దీపం, వేదాంతసారం –అనే మూడు గ్రంథాలు. ఉపనిషద్వాక్యాలను చక్కగా విచారించి, వాటిలోని అర్థాలను తెలిపే గ్రంథం వేదార్థ సంగ్రహం అనే గ్రంథం. శ్రీకృష్ణుడు పలికిన గీతకు వ్యాఖ్యానంగా ఏర్పడినది గీతా భాష్యం. శరణాగతి మార్గాన్ని వివరించేవి, గద్య త్రయం అనే పేరుతో ప్రసిద్ధి చెందిన మూడు స్తోత్రాలు. సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణునకు ఆరాధన చేసే ప్రక్రియను వివరించే గ్రంథం నిత్యగ్రంథం. నవరత్నాల వంటి ఈ తొమ్మిది గ్రంథాలు సంస్కృతంలో రచింపబడ్డాయి. భగవద్రామానుజుల పరంపరలో వారికి తరువాత ఒకటి రెండు వందల సంవత్సరాల లోపల జన్మించిన పలువురు మహానుభావులైన పూర్వాచార్యులు ఆళ్వారుల దివ్యప్రబంధాలకు తాము అనుగ్రహించిన ఈడు మొదలైన వ్యాఖ్యానాలలో శ్రీరామానుజులు ప్రబంధ పాశురాలకు చూపిన అద్భుతమైన వివరణలను అక్కడక్కడ అందంగా ఉండే ద్రావిడంలో పొదిగి కూర్చారు. వీటిని అన్నిటిని పురస్కరించుకొని, శ్రీరామానుజులతో చూపిన మార్గాన్ని ఇక్కడ సంగ్రహంగా విజ్ఞాపన చేయడం జరిగింది. వీటి నుండి శ్రీరామానుజులు సుస్థాపించిన విశిష్టాద్వైతశ్రీవైష్ణవ దర్శనం వేదకాలంనుండి భారతదేశంలో, సంఘకాలం నుండి ద్రావిడ దేశంలోనూ వెలసి వ్యాపించిన, ఉభయ వేదాంతైకకంఠ్యాన్ని అనుసరించిన మార్గమే– అని తెలియడానికి వీలవుతున్నది.

# గీతాభాష్యమ్

(ఉ. వే. శ్రీమాన్. అక్కారక్కని సంపత్కుమారాచార్యస్వామివారు అనుగ్రహించిన ద్రావిడవ్యాసం ఆధారంగా)
సమర్పణ– దాసుడు ఈ. ఏ. శింగరాచార్యులు

భగవద్రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలలో మూడు గ్రంథాలు ముఖ్యమైనవి. అవి– శ్రీభాష్యం, గీతాభాష్యం, శరణాగతి గద్య అనేవి. వీటిలో, వేదాంతార్థాలను నిష్కరించి సిద్ధాంతస్థాపనం చేయడం కోసమే శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు.

సాక్షాత్తు భగవంతుని వాక్కుతో అవతరించిన భగవద్గీతలోని యథార్థమైన, రసఘనమైన అర్థాలను వివరించి చూపడంకోసమని గీతాభాష్యాన్ని అనుగ్రహించారు. ఈ రెండుకూడా వ్యాఖ్యాన గ్రంథాలు అయినందున, మూలాన్ని అనుసరించే అర్థాలను వివరించవలసిన నిర్బంధం వీటిలో ఏర్పడింది. దీనివల్ల భగవద్రామానుజులు తమ మనసులో భాసించే అర్థాలను పూర్తిగా వ్యక్తం చేయడానికి తగిన అవకాశం లేకపోయింది. అందుచేత, దీనికి తగినట్లు శరణాగతి గద్య అనే గ్రంథాన్ని అనుగ్రహించారు.

ఆళ్వారులు, మన పూర్వాచార్యులు విశేషంగా ఆదరించిన అనేక విశేషార్థాలను వివరించడానికి శ్రీభాష్యంలో భగవద్రామానుజులకు పూర్తిగా అవకాశం లభించలేదు. ఎందుకంటే, బ్రహ్మ సూత్రకారులు ఆ విషయాలను గూర్చి ప్రస్తావించలేదు కనుక. సూత్రాక్షరాలకు అనుగుణంగానే భాష్యాన్ని రచిస్తున్నట్లు ప్రతిజ్ఞ చేసిన భగవద్రామానుజులు ఆ విషయాలను వివరించాలని అనుకోలేదు. అందుచేత, ఆ విషయాలను ఒక విధంగా సూచింప జేశారే తప్ప, ఆవశ్యకమైన పరిమితిలో వివరించలేదు. ఇక, భగవద్గీతలో అయితే, ఈ అర్థాలు ఇంచుమించుగా, చాలవరకు స్పష్టంగాను, మరికొన్ని సూచనగానూ చెప్పబడినందున, ఇందులో శ్రీరామానుజులు తమ మనస్సుకు తగినట్లు అర్థాలను వివరించే అవకాశం వారికి ఏర్పడింది.

బ్రహ్మసూత్రగ్రంథం అనేది వాదగ్రంథంగా అవతరించింది. దానిని వ్యాఖ్యానించేటప్పుడు తర్కం, వ్యాకరణం, మీమాంస మొదలైన శాస్త్రాల విచారం చేయవలసి ఉన్నది కనుక, దాని వ్యాఖ్యానం శుష్కవేదాంత గ్రంథంగానే నిలచిపోయింది. అందులో భగవదనుభవానికి విశేషమైన అవకాశం శ్రీభాష్యకారులకు లభించలేదు. భగవద్గీత ఆ విధంగా కాకుండా, అనుభవ శాస్త్రంగానూ గ్రహించే అవకాశం ఉన్నందున, దీని భాష్యం అనుభవ గ్రంథంగా ఏర్పడింది. అంటే, ఇందులో శ్రీరామానుజులు ఇందులో చెప్పబడిన భగవత్ స్వరూప రూపగుణచేష్టితాలను తాము అనుభవించి, ఆనందించి, వివరించే అవకాశాన్ని పొందారు. దీనికి మించి, శరణాగతి గద్యం పూర్తిగా అనుభవ గ్రంథంగా అవతరించింది. ఇది దాని విలక్షణమైన గొప్పతనం.

అనుభవ గ్రంథం అయినప్పటికీ గీతాభాష్యంలో శాస్త్రార్థనిష్కర్షానికి ఏ కొరతా లేదు. తిరువాయ్ మొழிవలె ఇది కూడా అనుభవం, శాస్త్రచర్చ కలసిన పరమవిలక్షణ గ్రంథంగా అవతరించింది. అయితే, 13వ అధ్యాయంలో తత్వత్రయ నిరూపణ ప్రకరణంలో తప్ప, మిగిలిన చోట్ల అంతా శాస్త్రార్థం చర్చించబడిన విషయమే తెలియకుండా, చాలా భోగ్యమైన రీతిలోనే అర్థాలు తెలుపబడడం ఈ భాష్యంలో ఉండే ఒక గొప్ప వైలక్షణ్యం.

భగవద్గీత చాలా లలితమైన శబ్దాలతో కూర్చబడి, చెవులారా విన్నంత మాత్రంలోనే అల్ప జ్ఞానం కలవారికికూడా అర్థం తెలుస్తుంది– అని భావించే రీతిలో ఉంటుంది. కానీ, అందులో ఎవరైనా ఏదైనా ఒక చిన్న ప్రశ్నను అడిగితే, సమంజసంగా బదులు చెప్పడానికి వీలు కాకుండా, ఎవరైనా సరే, తికమక పడవలసినట్లుంటుంది. ఉదాహరణకు, "కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః, అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః" (4–17) అనే గీతాశ్లోకాన్ని పై పైన గమనించినవారికి చాలా సులభమైనదని తోస్తుంది. కానీ, కర్మ, వికర్మ, అకర్మ అనే మూడు పదాలకు ఏమి

అర్థం? అని అడిగినట్లయితే, ఎటువంటి విద్వాంసుడు అయినా చెప్పలేక తికమక పడవలసి ఉంటుంది. కర్మ, అకర్మ –అని రెండు పదాలు మాత్రమే ఉన్నట్టయితే, మంచి కర్మ, చెడు కర్మ అని అర్థాన్ని చెప్పవచ్చు. అది కూడా ప్రకరణానికి పొసగదే! అనే విషయం అడిగితే, సమాధానం చెప్పడం వీలు కాదు– అనేది వేరే విషయం. . ఇక్కడ శ్రీరామానుజులు అనుగ్రహించిన వివరణం అత్యద్భుతమైనది.

బ్రహ్మసూత్రాలలో లభించనివి, గీతాభాష్యంలో సుభిక్షితంగా లభించేవి అయిన కొన్ని విషయాలను ఇక్కడ ప్రస్తావిస్తాను. ఏ వస్తువును వివరించి చూపడం కోసంగా బ్రహ్మసూత్రాలు రచింపబడ్డాయో, ఆ పరతత్వాన్ని ఆ గ్రంథం "బ్రహ్మం, బ్రహ్మం " అని చెప్పిందే తప్ప, దాని పేరును స్పష్టంగా నిర్దేశించలేదు. దీని పేరును పలువురు భాష్యకారులు" నిర్గుణం, నిర్విశేషం అని ఈ విధంగా చెప్పే ఏదో ఒక వస్తువు ఆ బ్రహ్మం "అని అంటూ వాదులాడడం ఆరంభించారు. ఆ వాదం ఈనాటికీ ముగిసిపోలేదు. భగవద్గీతలో ఈ కష్టం ఏమీ లేదు. శ్రీకృష్ణుడై అవతరించిన శ్రీమన్నారాయణుడు "నేనే పరతత్వం" అని పలుమార్లు చెప్పినందున, పరదేవతా నిష్కర్షం చేయడంలో ఏ విధమైన క్లేశం ఇందులో ఏర్పడలేదు.

భగవంతుడు అవతారాలను ఎత్తుతున్నాడు– అనే విషయాన్ని సూత్రకారులు ప్రస్తావించనేలేదు. గీతలో అయితే, అవతారాధ్యాయం అని చెప్పబడే ఒక అధ్యాయంలో ఈ విషయం విస్తృతంగా నిరూపింపబడింది. ఈ సందర్భంగా భగవద్రామానుజులు పలు పలు మహార్థాలను ప్రకాశింపజేశారు.

"అజ్ఞానం వల్ల సంసారం, జ్ఞానం వల్ల మోక్షం" అని అన్ని మతాలవారు చెబుతున్నారు. అయితే, ఈ జ్ఞానం అనేది ఎటువంటిది? అనే విషయాన్ని సూత్రకారులు ఏమీ స్పష్టం చేయనేలేదు. కొందరు భాష్యకారులు బ్రహ్మమని ఒక వస్తువు ఉన్నది– అని తెలిస్తే చాలు, మోక్షం లభిస్తుంది. లేక, ఇక్కడే ఇప్పుడే ఇప్పుడే

మోక్షం లభిస్తుంది– అని వాదం చేసేవారయ్యారు. శ్రీ భాష్యకారులు కొన్ని న్యాయాలను, ఆవృత్త్యధికరణ ప్రమేయాన్ని చూపి, తైలధారవలె నిరంతరంగా కొనసాగే జ్ఞానధారయే మోక్షోపాయమైన బ్రహ్మజ్ఞానం అనబడుతుంది– అని స్థాపించారు. నిరంతరంగా– అని అంటే, వేరొక విషయంలో కొంచెం కూడా పోకుండా, ఎల్లప్పుడూ చేయబడే భగవంతుని ధ్యానమే శాస్త్రాలు చెప్పే బ్రహ్మజ్ఞానం అవుతున్నది –అని వివరించారు. అయితే, ఇది కూడా చాల లేదు. రామబాణరుచిని రెండుసార్లు అనుభవించిన మారీచుడు తరువాత రామబాణభయంవల్ల ఎల్లప్పుడూ తనకు శ్రీరాముడే ఎక్కడ చూసినా కనిపిస్తున్నట్లు పలికాడు. దీనివల్ల, అతనిని బ్రహ్మజ్ఞాని అని కానీ, ఉపాసకుడు– అని కానీ చెప్పవచ్చునా? అని అంటే దానికి సమాధానం బ్రహ్మసూత్రాలలో లేదు. శ్రీరామానుజులు మాత్రం, కొన్ని వేదవాక్యాలను ఉదాహరించి, ప్రేమతో చేసే ధ్యానమే ఉపాసన అనబడుతుంది– అని వివరించారు. అయితే, ఇది కూడా చాలదు. "భగవంతుడు మనకు స్వామి, మనం అతనికి శేషమై ఉండేవారం " అనే జ్ఞానం కూడా ఉండి తీరాలి. ఈ విధంగా అన్ని అంశాలతో కూడిన జ్ఞానానికి భక్తి అని పేరు. అందుచేత, భక్తియే మోక్షసాధనం– అని తేలింది. అయితే, భక్తి శబ్దాన్ని శ్రీభాష్యంలో పలుచోట్ల ప్రయోగించే భాష్యకారులు దానిని ఇంతగా వివరించలేదు. ఎందుకంటే, మూలం అవకాశం ఇవ్వలేదు కనుక. కానీ, గీతాభాష్యంలో అయితే. "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు" అనే శ్లోకభాష్యంలో శ్రీరామానుజులు ఈ అర్థాన్ని చాలా అద్భుతంగా వివరించారు. ఏ విధంగా అంటే–

ఇక్కడ. "మన్మనా భవ" అనేదే ముఖ్యమైన విధేయశబ్దం. నా విషయంలో, అంటే, భగవంతుని విషయంలో, మనసును నిలుపు, అంటే, నన్నే నిరంతరం ధ్యానం చేయి. " మద్భక్తః" – అనే పదాన్ని "మద్భక్తః మన్మనా భవ" అని కలిపి గ్రహించాలి. " నా విషయంలో ప్రేమను కలిగినవాడవై ధ్యానం చేయి, అంటే మారీచుని వలె ప్రేమ లేకుండా ధ్యానం చేయకుయ– అని అర్థం.

"మద్యాజీ మద్భక్తః మన్మనా భవ"– నన్ను పరిపూర్ణంగా ఆరాధించే పర్యంతంగా పరిణతి చెందిన ప్రేమను కలవాడవై నన్ను ధ్యానం చేయి. అంటే, నన్ను ధ్యానం చేస్తే కలిగిన ప్రీతి అనేది చాలా బాగా వృద్ధి చెంది, దాని వలన ప్రేరేపింపబడి, నన్నే పరిపూర్ణంగా ఆరాధించేవాడవు కావాలి– అని అర్థం. గద్యంలో శ్రీరామానుజులు " అనుభవ జనితానవధికాతిశయ ప్రీతికారితాశేషశేషతైకరతిః" అనే శబ్దాన్ని మాటిమాటికి ప్రయోగిస్తారు. దీని భావం ఏమంటే– భగవంతుని అనుభవించడం వల్ల అంతు లేని ప్రీతి కలగాలి. ఆ ప్రీతి అనేది వృద్ధి చెందగా, వృద్ధి చెందగా, ఏదైనా ఒక కైంకర్యంలోకి ప్రేరేపించాలి. అంటే, ఏదో ఒక కైంకర్యాన్ని చేస్తే తప్ప నిలువ లేని స్థితి కలగాలి. ఈ స్థితిలోని కొన్ని సమయాలలో శరీరం మనసు, విహ్వాలమై, నిజానికి ఒక విధమైన కైంకర్యం కూడా చేయలేని స్థితి కలుగవచ్చు. అయితే, "ఏమైనా చేయాలి" అనే అభినివేశం మాత్రం మరింత మరింత వృద్ధి చెందుతుంది. ఈ అభినివేశమే కైంకర్యం అవుతుంది. ఈ భావాన్ని ఈ గీతాశ్లోక భాష్యంలో భగవద్రామానుజులు తెలియజేశారు. లేక, స్వామికి గీతాచార్యుడే స్వయంగా ఈ విషయంలో ఈ అర్థాన్ని తెలియజేశాడు. అందుచేత, ధ్యానం అంటే, ఈ విధంగా కైంకర్యాన్ని చేయాలి– అనే అభినివేశం కలిగే రీతిలో ముదిరిన భక్తితో ధ్యానం చేయబడాలి– అని చెప్పినట్లయినది.

ఇక, " మాం నమస్కురు" అనే సూక్తికి, సులభంగా, "నన్ను నమస్కరించు " అనే అర్థం చెప్పి, శ్రీరామానుజులు నిలువలేదు. మరి ఏమి చేశారు? అంటే, పూర్వం వివరించిన మూడు పదాలను దీనితో ఏకవాక్యంగా కూర్చి, అర్థం చెప్పారు. కైంకర్యంలో ముదిరిన దశ అయిన ఆత్మ సమర్పణనే ఈ పదం తెలుపుతుంది. అంటే, పూర్వం తెలిపిన విధంగా ప్రీతితో ప్రేరేపింపబడి, పలు విధాలైన సేవలను చేసినా, మనస్సులో తృప్తి పొందకుండా, ఇంకా ఇంకా ఏమి ఏమి చేయాలి? ఏమేమి చేయాలి? అని సంభ్రమించి, చివరిగా తననే భగవంతునకు సమర్పించుకోవాలి. – అని వివరించారు. ఈ విషయాన్ని శ్రీవైకుంఠ గద్యలో చివరిలో " ప్రణమ్య ఆత్మానం భగవతే నివేదయేత్" అని శ్రీరామానుజులే స్వయంగా పలికారు. అందుచేత, ఇటువంటి అవస్థలను పొందిన ప్రీతితో

నన్నే ఎల్లప్పుడూ ధ్యానం చేయి– అని శ్రీకృష్ణుడు అర్జునునకు భక్తిప్రకారాన్ని వివరించాడు– అని శ్రీ రామానుజులు తెలియజేశారు. అయితే, ఇంతటి అర్థాన్ని శ్రీ రామానుజులు భగవద్గీతకు ఆరోపించి చెప్పలేదు. స్వరసంగానే ఇది లభించే అర్థం. అయితే, శ్రీ రామానుజుల శ్రీభాష్యం సేవించకుండా ఎవరికి ఇది తెలిసే అవకాశం లేదు. బ్రహ్మసూత్రాలలో ఇంతటి విశదమైన అర్థానికి అవకాశం ఇచ్చే శబ్దం ఏదీ లేదు.

దీనికి తరువాత, మన సిద్ధాంతంలో మూలంగా గ్రహించిన ప్రపత్తి అనే శరణాగతికి వాచికమైనది గాని, సూచకమైనది గాని అయిన ఏ శబ్దం కూడా బ్రహ్మసూత్రాలలో కనిపించే అవకాశం లేనందున, శ్రీభాష్యంలో చర్చను చేసే అవకాశం లేకుండా పోయింది. అయితే, గీతలో ఈ అర్థం సుభిక్షంగా ఉన్న ది. ఆరంభంలో అర్జునుడు " శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని శ్రీకృష్ణుని శరణాగతి చేశాడు. గీతాచార్యుడు పలు సందర్భాలలో మామేవ యే ప్రపద్యంతే", " తమేవ చార్యం పురుషం ప్రపద్యే", " తమేవ శరణం గచ్ఛ", "మామేకం శరణం వ్రజ" అని అన్నాడు. దీనివల్ల శరణాగతి గొప్పతనాన్ని వివరించే అవకాశం శ్రీరామానుజులకు ఏర్పడింది.

ఆచార్యుని గొప్పతనాన్ని కూడా "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్వదర్శినః" అని గీతాచార్యుడు చూపించాడు. అంతేకాక, అవతారకాలాన్ని తెలియజేసే శ్లోకంలోని " తదాత్మానం సృజామ్యహమ్" అనేదానికి " నేను అవతరిస్తాను" అనే అర్థం తెలియజేశాడు. . "నాకు ఆత్మ అయిన జ్ఞానిని కూడా అవతరింపజేస్తాను" అనే అర్థాన్ని ఇక్కడ చెప్పే అవకాశం కూడా ఉన్నది. కనుక, ఆచార్యుని గొప్పతనంకూడా ఇక్కడ వివరింపబడినట్లయినది.

భగవంతుడు చేతనులను సంస్కరించి, వారిని తరింపజేసి, వారినుండి కైకర్యం స్వీకరించడం కోసమే జగత్తును సృష్టించి, శాస్త్రాలను ఉపదేశించి, అవతారాలను ఎత్తి, ఇంకా అనేక విధాలయిన కార్యాలను ఏమీ సోమరితనం లేకుండా చేస్తున్నాడు– అని

మన ఆచార్యులు మాటి మాటికి తెలియజేస్తారు. ఇదంతా ఒక్కటి కూడా విడవకుండా గీతలో చెప్పబడినది. దానిని కొంచెం వివరిస్తాను.

"తస్మిన్ గర్భం దధామ్యహమ్", " అహం బీజప్రదః పితా" అని గీతలో స్పష్టంగా చెప్పబడింది. " సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ" అని, " ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ౽ ర్జున! తిష్ఠతి" అని " భగవంతుడు అందరి హృదయంలోనూ నిలచి ఉండి, యథోచితంగా వారి జ్ఞానం, అజ్ఞానం, మరపు మొదలైనవానిని తానే నిర్వహిస్తున్నాడు "అని చెప్పాడు. దీనివల్ల కొందరికి కలిగే భగవత్ జ్ఞానం అతడు కలిగించిన అనుగ్రహమే– అనేది తెలుస్తున్నది. " దదామి బుద్ధియోగమ్" అని అన్నందున, ఆ జ్ఞానంలోని పరిపాకమైన భక్తిని కూడా అతడే ఇస్తున్నాడు– అనే విషయం చెప్పబడింది. దీనికి విరోధి అయిన అజ్ఞానాన్ని అతడే తొలగిస్తున్నాడు– అనే విషయం "అహ మజ్ఞానజం తమః నాశయామి" అని చెప్పబడింది. దీనికి ఆవశ్యకమైన పోషణను కూడా తానే చేస్తున్నట్లు చెప్పిన సందర్భం "యోగక్షేమం వహామ్యహమ్" అనేది. దీనివల్ల తనకు దూరంగా పోయిన ఇతరులకు కూడా సంసార విమోచనం చేయించవలసినవాడు, అతడే – అనే విషయం "తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" అని చెప్పబడింది. ఇక, చివరిగా "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అని తన వచనాన్ని గీతాచార్యుడు పూర్తి చేశాడు. ఈ విధంగా ఇంతటి విశేషాలను నిష్కర్షించి పలికాడు– అని తెలియాలి. అందుచేత భగవద్రామానుజులకు పలు విధాలుగా చేయూతను ఇచ్చి, వారి మనసులోని అభిప్రాయానికి అనుగుణంగా భాష్యాన్ని రచించే అవకాశం ఇచ్చిన మహాగ్రంథమే భగవద్గీత –అనేది తెలుస్తున్నది.

భగవద్గీత యొక్క అవతారమే భగవంతుని ఈ విశేషోపకారానికి సూచకమనే విషయాన్ని శ్రీ రామానుజులు తెలియజేశారు. గీతలోని మొదటి అధ్యాయానికి అర్జున విషాద యోగం అని పేరు. యుద్ధం చేసే సమయంలో అర్జునుని మనస్సులో ఏదో ఒక

బంధుస్నేహం, దయ, యుద్ధభీతి ఏర్పడగా, దాని వల్ల అతడు చాలా వ్యాకులాన్ని పొంది, యుద్ధం చేయడానికి మనస్సు లేనివాడై, శ్రీకృష్ణుని చూచి, "నా మనస్సు కలతపడుతున్నది. నేను ఏమి చేయాలో తెలియలేక తపిస్తున్నాను. ఇప్పుడు నీవే నాకు దారి చూపించాలి" అని వేడగా, అతనిని యుద్ధంలో ప్రేరేపించడం కోసం శ్రీకృష్ణుడు గీతోపదేశం చేశాడు— అని ఇక్కడ చెప్పబడింది. అయితే, ఇక్కడ ఒక బలమైన సందేహం కలుగవచ్చు. అది ఏమంటే— "అర్జునుని యుద్ధంలో ప్రేరేపించడం కోసం ఇంతగా విస్తరమైన తత్వశాస్త్రాన్ని ఉపదేశించవలసిన ఆవశ్యకత ఏమి? అతనికి సమయోచితమైన కొన్ని రాజనీతులను చెప్పినట్లయితే చాలదా?" అని ఇక్కడ సందేహం కలుగవచ్చు. దీనికి మన స్వామి అయిన శ్రీ రామానుజులు గీతాభాష్యంలోని అవతారికలో యథార్థమై, తగినదై ఉండే సమాధానాన్ని తెలియజేశారు. అది ఏ విధంగా అంటే, భగవంతుడు లోకాన్ని ఉద్ధరించడం కోసం అవతారాలను ఎత్తుతున్నాడు కదా. అందులో ఒక గొప్ప అధ్యాత్మ శాస్త్రాన్ని ఉపదేశించాలి— అనే ఆశ అతనికి కలిగింది. అయితే, ఎవరూ అతని దగ్గర ఉపదేశం వినడానికి రాలేదు. విననివారికి, అంటే, ఆశ లేనివారికి చేసే ఉపదేశం వ్యర్థమైపోతుంది. అందుచేత, శ్రీకృష్ణుడు తానే ఈ సమయంలో అర్జునుని హృదయంలో ఈ విధంగా ఒక కలతను కలిగించి, అతడు తనను అడిగేటట్లు చేసి, అతనికి ఉపదేశించేవానివలె లోకంలో ఉండే జిజ్ఞాసువుల కోసం విస్తృతమైన గీత శాస్త్రాన్ని ఉపదేశించాడు. అందుచేత, అర్జునుని ప్రేరేపించడం అనేది కేవలం ఒక వ్యాజం మాత్రమే. లోకానికి యథార్థమైన జ్ఞానాన్ని ఉపదేశించాలి— అనేదే భగవంతుని ముఖ్యమైన అభిప్రాయం అనేది భగవద్రామానుజులు అనుగ్రహించిన గొప్ప అర్థం. అందులోనూ, శిష్యుని కఠినంగా పరీక్షించి, తరువాత ఉపదేశించే కొందరు ఆచార్యులవలె కాకుండా, అడిగిన వెంటనే ఉపదేశించిన గీతాచార్యుడు కృపామాత్రప్రసన్నాచార్యుడే కదా, అవుతాడు.

బ్రహ్మసూత్రాలలో చెప్పబడిన ఉపాసన యొక్క స్వరూపాన్ని భావించేటప్పుడే మన శరీరం జంకుతుంది. "దీనిని మనం చేయగలమా?" అని భయమే మనకు

ఏర్పడుతుంది. అయితే, దానినే గీతాచార్యుడు ఉపదేశించేటప్పుడు, అది చాలా మధురంగా తోస్తుంది. సూత్రకారుడు ఉపదేశించిన ఉపాసననే గీతలో "మన్మనా భవ" అనే శ్లోకం కూడా ఉపదేశిస్తున్నది. అయితే, ఇందులో ప్రీతిని పురస్కరించుకొని ఉపదేశించినందున ప్రేమశీలి అయిన భగవంతుని ధ్యానించడం, ఆ స్వామికి కైంకర్యం చేయడం మధురంగా ఉంటుంది– అని భావించేటట్లుగా ఉంటుంది. ఐదవ అధ్యాయంలోని చివరిలో శ్లోకం, దాని భాష్యం ఈ అర్థాన్ని చాలా స్పష్టంగా తెలియజేస్తున్నాయి. "భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్, సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి" అనేది ఆ శ్లోకం. ఈ అధ్యాయంలో కర్మయోగంలోని ప్రశంస ప్రసక్తమైనది. దానిని వినిన అర్జునుని మనసులో "ఇది సరి అయితే, అన్ని ఇంద్రియాలను నియంత్రించి, అణచి, ఈ కర్మయోగం చేయడం అనేది చాలా కష్టంగా ఉంటుంది కదా! " అనే భయం అతనికి కలిగింది. దానిని తీర్చడం కోసం ఈ శ్లోకం అవతరించింది. దీని అర్థం ఏమంటే–

"అర్జునా! నీవు నన్నే అన్ని తపస్సులు మొదలైన కర్మలతో ఆరాధింపబడేవానినిగా, (అంటే, అన్ని కర్మలు నా పూజయే అని) , నేను అందరికీ ప్రభువు అని, (అంటే, నీకు నీకు ప్రాప్తశేషి అని) , దీనికి మించి, సర్వభూతసుహృత్తు అని (నీ స్నేహితుడనని) భావించేవాడవు అయితే, కర్మయోగం చేయడంలో నీకు మహానందమే కలుగుతుంది. అదే స్వయంపురుషార్థంగా తోస్తుంది. – అని అర్థం. ఇక్కడ భాష్యకారులు చాలా భోగ్యమైన "సుహృదారాధనాయ హి సర్వే ప్రయతంతే" అని ఒక వాక్యాన్ని అనుగ్రహించారు. స్నేహితుని ఆరాధించాలి–అని లోకంలో అందరూ ప్రయత్నిస్తారు కదా. అందులో ఎవరికైనా శ్రమ కాని, ఏవగింపు కాని కలుగుతుందా? ఆ విధంగానే, మనకు ప్రాప్తశేషి, స్నేహితుడు, మననపై అంతు లేని ప్రేమను కలిగినవాడు అయిన భగవంతుని ఆరాధించడంలో శ్రమ ఏమున్నది? ఈ ఆరాధనయే కర్మయోగం.

మన సంప్రదాయంలో మోక్షం అనేది వైకుంఠాన్ని చేరి, భగవంతుని విషయంలో మనం చేసే నిత్య కైంకర్యమే— అని చెప్పబడుతున్నది. దీనిని మిగిలినవారు కైంకర్యం దుఃఖరూపం— అని చెప్పి, దూషిస్తున్నారు. దీనికి సమాధానంగా శ్రీరామానుజులు ఈ వాక్యాన్ని అనుగ్రహించారు కదా.

స్వర్గం మొదలైన గొప్ప ఫలాన్ని కోరి, ఒక యాగం చేసినపుడు అది ఏ కొరతా లేకుండా సరిగా పూర్తి కావాలి. ఆ విధంగా లేకుండా, అందులో ఏదైనా ఒక దోషం, కొరత ఏర్పడితే, దాని వలన కోరిన ఫలం లభించదు— అనేది ఒక వైపు ఉండగా, పెద్ద అపచారం కూడా ఏర్పడుతుంది. దానివల్ల బ్రహ్మరాక్షసజన్మ లభిస్తుంది. అయితే, మోక్ష సాధనమైన భక్తిని అనుష్ఠించడం ఆరంభించి, అందులో విఘ్నం ఏర్పడినా, దానివల్ల ఏ విధమైన ఆపద సంభవించదు. చేసిన పరిమితికి అది వ్యర్థం కాదు. తరువాత జన్మలోనో, లేక, పలు జన్మలలోనో, దానిని అనువర్తించి, ఆచరించి, మనం సిద్ధి పొందవచ్చు —అని గీతాచార్యుడు చెప్పాడు— ఆరవ అధ్యాయం చివరిలో. ఇది ఒక గొప్ప లాభం కదా. ఈ విషయం సూత్రాలలో చెప్పబడలేదు.

ఇక, అవతారాధ్యాయంలో గీతాచార్యుడు అనుగ్రహించినది, దానికి శ్రీరామానుజులు భాష్యాన్ని అనుగ్రహించినది ఒక అద్భుతమైన విషయం. ఈ అధ్యాయంలోని ఆరంభంలో శ్రీకృష్ణుడు సృష్టి కాలంలో వివస్వంతునకు తానే కర్మయోగాన్ని ఉపదేశించినట్లు, అది కొంచెం కాలం గడచిన తరువాత లోపించినట్లు చెప్పగా, అర్జునుడు తటాలున ఈ విధంగా ఒక ప్రశ్న అడిగినట్లుగా నాలుగవ అధ్యాయంలో ఉన్నది. "శ్రీకృష్ణా! వివస్వాన్ కాలం ఏది? నీ కాలం ఏది? ఏనాడో ఉన్న వివస్వాన్ కు నీవు ఉపదేశం చేశావు— అని నేను ఏ విధంగా నమ్మడం? " అని అర్జునుడు అడిగాడు. దీనికి సమాధానం చెప్పే రీతిలో గీతాచార్యుడు తన అవతారంలో ఉండే పలు రహస్యాలను తెలియజేశాడు. ఇక్కడ భగవద్రామానుజులు ఒక అక్షేపాన్ని లేవదీసి, దానికి తామే సమాధానం అనుగ్రహించిన అందాన్ని గూర్చి ఏమని చెప్పగలం?

ఇక్కడ ఆక్షేపం ఉండే రీతి ఎటువంటిది? అంటే, అర్జునుడు శ్రీకృష్ణుని ఒక సాధారణ మానవునిగా భావించలేదు. సర్వేశ్వరునిగానే భావించాడు. ఇంతకు ముందు, సభాపర్వంలో, ధర్మపుత్రుడు రాజసూయ యాగాన్ని చేసినప్పుడు, గోష్ఠిలో మొదటి తాంబూలం గ్రహించడానికి ఎవరు అర్హులు? అనే చర్చ జరిగినప్పుడు, భీష్ముడు శ్రీకృష్ణుని గొప్పతనాలను అన్నిటిని వివరంగా పలికి, అతడే అగ్ర పూజకు తగినవాడు– అని చెప్పగా, ఆ విధంగానే అగ్రాసనం అతనికి ఇవ్వబడింది. తరువాత, పదవ అధ్యాయంలో అర్జునుడు తానే అసితుడు, దేవలుడు, వ్యాసుడు మొదలైన పలువురు మహానుభావుల ద్వారా శ్రీకృష్ణుడు నారదుని మహిమలను విన్నట్లు స్పష్టంగానే చెప్పాడు. ఈ విధంగా తెలిసినప్పటికీ, వివస్వంతునకు ఏ విధంగా నీవు ఉపదేశించావు? అని అతడు అడగవచ్చా? భగవంతుడు చేయలేని కార్యం అనేది ఒకటి ఉన్నదా? అందుచేత అర్జునుడు అడిగిన విధమే సరిగా లేదే! –అని తోస్తుంది.

దీనికి శ్రీరామానుజులు అనుగ్రహించిన సమాధానం ఈ విధంగా ఉన్నది. అర్జునుడు అడిగిన ప్రశ్నకు గంభీరమైన అభిప్రాయం ఒకటి ఉన్నది. దానిని అతడు అడిగిన మాట వల్ల కాకుండా, భగవానుడు ఇచ్చిన సమాధానం వల్ల తెలియాలి. అర్జునుడు అడిగినదానికి సమాధానాన్ని ఇచ్చే భగవానుడు, తన అవతారాలు అనేకం, సత్యమైనవి, ఈ ప్రకారంగా, ఈ కారణంచేత, ఈ కాలంలో, ఈ ప్రయోజనాలను ఉద్దేశించి చేయబడుతున్నాయి– అని అంతా నాలుగు శ్లోకాలలో, చాలా విశదంగా ప్రత్యుత్తరం ఇవ్వడాన్ని గమనిస్తే, అర్జునుని మనస్సులో అవతార విషయమైన పలు సందేహాలు ఉన్నట్లుగాను, వానిని అన్నిటిని సూచించాలని కోరి, ఏదో ఒక ప్రశ్నను అడిగినట్లుగాను, సర్వజ్ఞుడైన భగవంతుడు అతని అభిప్రాయాన్ని తెలిసికొని, అతని సందేహం తీరేటట్లుగా సమాధానం చెప్పినట్లుగాను గ్రహించాలి. అర్జునుడు సందేహించినది ఏ విధంగా? అంటే, "శ్రీకృష్ణుడు వివస్వంతునకు తాను ఉపదేశించినట్లు చెబుతున్నాడే! అప్పుడు అతడు ఒక అవతారం ఎత్తినవాడై ఉండాలి. అతడే ఈ

సమయంలో శ్రీకృష్ణుడుగా అవతరించాడు. దీనివల్ల ఇతడు మాటిమాటికి ఈ లోకంలో అవతరిస్తున్నాడు– అని తెలుస్తున్నది. పూర్వం చేసిన కర్మల ఫలంగా, మనం మానవాది పలు శరీరాలను మాటిమాటికి గ్రహించి, పలు విధాలైన దుఃఖాలకు లక్ష్యం అవుతున్నాం. అయితే, శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడు. అతనిని ఏ కర్మ కూడా బంధించదు. అటువంటివాడు అవతరించడానికి ఏమి కారణం? అతడు పరిగ్రహించే శరీరాలు ఎటువంటివి? అవతరించి అతడు చేసే కార్యాలు ఎటువంటివి? అవతరించటానికి తగిన కాలం ఏది? అని ఈ విధంగా ఉండే విషయాలను అన్నిటిని తెలిసికోవాలని కోరే అర్జునుడు అడిగాడు. , అతని మనస్సును తెలిసిన గీతాచార్యుడు సమాధానాన్ని చెప్పాడు–అనేది మన భాష్యకారులు చూపిన అందమైన మర్మం.

ఈ విధంగా, పలు విధాలుగా ఉన్నతమైన గీతాభాష్యదివ్యగ్రంథాన్ని ప్రతి వైష్ణవుడు నిత్యపారాయణం, కాలక్షేపం మొదలైన క్రమాలలో సేవించి, గౌరవించాలి. అనుభవించి ఆనందించాలి.

# సంభవామి యుగే యుగే

శ్రీకృష్ణ భగవానుడు తన అవతార రహస్యాన్ని తెలియజేస్తూ భగవద్గీతలో పలికిన "పరిత్రాణాయ సాధునాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అనే శ్లోకం సుప్రసిద్ధమైనది. ఈ శ్లోకాన్ని బట్టి భగవంతుడు సాధువులను రక్షించడం కోసం ఈ లోకంలో ప్రతి యుగంలో అవతరిస్తాడు—అని తెలుస్తున్నది. ఈ సూక్తిలో యుగశబ్దప్రయోగంలో ధనించే ఒక అర్థ విశేషాన్ని గమనిద్దాం. ముందుగా పై శ్లోకంలో ప్రయోగింపబడిన సాధుశబ్దానికి భగవద్రామానుజులు చేసిన వివరణ గమనించదగినది.

లోకంలో సాధువులు మూడు విధాలుగా ఉంటారు. సాత్త్విక గుణం అధికంగా కలిగి, ఇతరులను బాధించకుండా, చక్కని ధర్మబద్ధమైన రీతిలో జీవితాన్ని గడపేవారు సాధువులనబడతారు. వీరు ఒక విధమైన సాధువులు. చక్కగా శాస్త్రార్థాలను గ్రహించి, వేదతత్త్వాలను తెలిసికొన్నవారై, భగవంతుని ఉపాసించేవారు ఇంకొక విధమైన సాధువులు. ఈ రెండు విధాలయిన సాధువుల కోసం భగవంతుడు అవతరించడు. వేరొక విధమైన స్వభావాన్ని కలిగిన సాధువుల కోసమే భగవంతుడు ఈ లోకంలో అవతరిస్తున్నాడు— అని శ్రీరామానుజులు అవి శ్లోకంలో అర్థనిర్ణయం చేశారు. ఆ సాధువులు ఎటువంటివారో, తమ గీతాభాష్యంలో శ్రీరామానుజులు. " ఉక్తలక్షణధర్మశీలాః వైష్ణవగ్రేసరాః మత్సమాశ్రయణే ప్రవృత్తాః, మన్నామకర్మస్వరూపాణాం వాఙ్మనసాగోచరతయా మద్దర్శనాదృతే ఆత్మధారణ పోషణాధికమ్ అలభమానాః క్షణమాత్రకాలం కల్పసహస్రం మన్వానాః, ప్రశిథిలసర్వగాత్రాః భావేయురితి మత్స్వస్వరూప చేష్టితావలోకనాలాపాదిదానేన తేషాం పరిత్రాణాయ" (ఇంతకుముందు చెప్పబడిన లక్షణాలను కలిగినవారైన వైష్ణవోత్తములు నన్ను ఆశ్రయించాలని ప్రయత్నించినప్పటికీ, నా నామాలు, లీలలు, స్వరూపం అనేవి వాక్కుకు, మనసుకు అందనివి కనుక, నా దర్శనం లభించకపోతే

ప్రాణాలను ధరించడం గాని, శరీరాన్ని పోషించుకోవడం కానీ చేయలేనివారై, క్షణకాలం కూడా వేలాది కల్పాలుగా భావించేవారై, శరీరంలో అంతటా వారు శైథిల్యాన్ని పొందుతారు— అని భావించి, వారికి నా స్వరూపాన్ని, లీలలను, కటాక్షాలను, అలాపాలు మొదలైనవానిని అనుగ్రహించడం ద్వారా వారి అభీష్టాన్ని తీర్చి వారు తమ ప్రాణాన్ని, దేహాన్ని ధరించేటట్లు చేసి, వారిని రక్షించడంకోసం నేను అవతరిస్తున్నాను) అనే అందమైన, రుచిరమైన వ్యాఖ్యాన సూక్తి ద్వారా తెలియజేశారు. బాహ్యేంద్రియాలకు అందనివి, వాక్కుకు, మనసుకు కూడా అందనివి అయిన భగవంతుని స్వరూపాన్ని, లీలలు మొదలైన వానిని వెంటనే దర్శించి ఆనందించాలని, అందులో క్షణకాలం ఆలస్యం అయినా ఆ ఆలస్యం వేలాదికల్పాలతో సమానంగా భావించేవారై, భగవదనుభవంలో మిక్కిలి ఆర్తిని పొందినవారెవరో వారే సాధువులు. అటువంటి మహానుభావుల ఆశను తీర్చి, వారు కోరినట్లుగా వారికి నా దర్శనాన్ని, నా లీలలను, నా కటాక్షాలను, నా ఆలాపాలను అనుగ్రహించడం కోసమే నేను ఈ లోకంలో అవతరిస్తున్నాను —అని భగవంతుడు స్వయంగా తన అవతారహేతును స్పష్టం చేశాడు—అని శ్రీరామానుజులు తమ గీతాభాష్యంలో వివరించారు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. పైన తెలియజేసిన వివరణను శ్రీ రామానుజులు నమ్మాళ్వార్లవంటివారి స్వభావాన్ని దృష్టిలో పెట్టుకొని చేశారు— అనేది స్పష్టం. ఈ గీతలోనే భగవానుడు ఇంకొక చోట "ప్రియో హి జ్ఞానినో ౬ త్యర్థ మహం స చ మమ ప్రియః" (జ్ఞాని అయినవానికి నేను చాలా ఇష్టమైనవాడను, నాకుకూడా అతడు చాలా ఇష్టమైనవాడు) అని అన్నాడు. ఇక్కడ ఈ సూక్తిలో ఉండే "అత్యర్థం" అనే పదాన్ని ముందు వెనుకలలో అన్వయించి, ఈ విధంగా అర్థం చెప్పబడింది. బ్రహ్మసూత్ర భాష్యంలో భగవద్రామానుజులు "అనావృత్తిః శబ్దాత్" అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ, " అత్యంతప్రియం జ్ఞానినం లబ్ధ్వా" అని అంటూ, భగవంతునకు జ్ఞాని చాలా ఇష్టమైనవాడు— అని అన్నారు. ఈ విధంగా రెండు వైపులా ఈ పదాన్ని అన్వయించి అర్థం చెప్పడానికి తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో "శూ*ழ்*న్దు" అనే చిట్టచివరి పాశురంలో

ఆళ్వారులు పలికిన అర్థమే ఆధారం. ఈ పాశురంలో ఆళ్వారులు –తత్వత్రయాన్ని కబళీకరించే విధంగా చాలా పెద్దదిగా ఉండే తమ ఆర్తి కూడా అణుమాత్రంగా అనేటట్లుగా చేస్తూ, భగవంతుడు తనకు వారి విషయంలో కల అంతు లేని ఆర్తిని చూపి, వారి ఆర్తిని తీర్చాడు– అని అన్నారు. ఈ సూక్తిని బట్టి చూస్తే, భక్తునకు భగవంతుని విషయంలో ఉండే ఆర్తి కంటే, ఆ భక్తునిపై భగవంతునకు ఉండే ఆర్తియే గొప్పది– అనేది స్పష్టమవుతున్నది.

ఆళ్వారులవంటి భక్తులకు భగవంతుని దర్శించాలనే ఆర్తి వల్ల ఒక్క క్షణం కూడా వేయి కల్పాల కాలంగా తోస్తుంది– అనేది శ్రీరామానుజుల వివరణం. భక్తుల ఆర్తి కంటే భగవంతుని ఆర్తి గొప్పది– అని ఆళ్వారుల అనుభవం. భగవంతుని విరహంలో భక్తునకు ఒక క్షణకాలం వేయి కల్పాలుగా చూస్తే, ఆ భక్తుని కంటే మిక్కిలి ఆర్తిని కలిగిన భగవంతునకు భక్తుని విరహంలో ఒక క్షణం ఒక యుగంగా తోచడంలో ఆశ్చర్యం ఏమున్నది? అందువల్ల "సంభవామి యుగే యుగే" అనే భగవంతుని వచనంలోని యుగశబ్దానికి, భగవదభిప్రాయాన్ని బట్టి, క్షణమనే అర్థం గ్రహించడంలో ఏ విధమైన ప్రత్యవాయం లేదు కదా. అంటే, సాధు శబ్దంచేత చెప్పబడే భక్తుల మనోరథాన్ని తీర్చి, వారిని రక్షించడం కోసం తాను ప్రతిక్షణం అవతరిస్తూ ఉంటానని భగవంతుడు చెప్పినట్లు ఇక్కడ ఒక సరసమైన అర్థాన్ని చెప్పే వీలున్నది కదా. " బహూని మే వ్యతీతాని జన్మాని" అనే భగవంతుని వచనానికి కూడా ఇది కుదురుతుంది.

# శ్రీవిష్ణుసహస్రనామాధ్యాయమ్

(న్యాయవేదాంతవిద్వాన్ ఉ. వే. శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్యస్వామివారి ద్రావిడ వ్యాసం ఆధారంగా)
సమర్పణ –ఈ. ఏ. శింగరాచార్య దాసుడు.

శ్రీ విష్ణుసహస్ర నామాధ్యాయం శ్రీ మహాభారతం అనుశాసన పర్వంలో చేరిన ఒక భాగం. ఈ విధంగా ఉన్నప్పటికీ, "ఈ అధ్యాయం మహాభారతసారం " అని శ్రీపరాశరభట్టర్ అభిప్రాయపడ్డారు. "మహాభారత సారత్వాత్" అని ఆ మహాచార్యుల సూక్తి ఇక్కడ అనుసంధించదగినది. శ్రీమహాభారతం వ్యాసమహర్షి అనుగ్రహించిన గొప్ప గ్రంథం అనేది లోకానికి అంతటికీ తెలిసిన విషయమే. వ్యాసుడు పరాశర మహర్షి పుత్రుడు. " స హోవాచ వ్యాసః పారాశర్యః" అని వేదంలోనే ఈ మహర్షి కీర్తింపబడ్డాడు.

శ్రియః పతి అయిన పరమ పురుషుడు సంసారి చేతనుని ఆత్మక్షేమాన్ని ఉద్దేశించి, ఉపకరించిన జ్ఞానమార్గం కృతయుగంలో ఆ విధంగానే ఉన్నది. త్రేతాయుగంలో అది కొంచెం మార్పు చెందింది. ద్వాపరయుగంలో మరింత పాడయినది. ఆ కాలంలో బ్రహ్మ మొదలైన దేవతలు సర్వరక్షకుడైన నారాయణని శరణు పొందారు. అప్పుడు పరమాత్మ పరాశరమహర్షికి, సత్యవతికి కుమారుడుగా వ్యాసుడై అవతరించాడు. వ్యాసుడు వేదాలను ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం– అని నాలుగు వేదాలుగా విభాగించి, వాటి శాఖావిభాగాలను కూడా చేశాడు. ఆ వేదాల అర్థాన్ని అందరూ యథాతథంగా తెలిసికొనేటట్లు తన శిష్యుడైన జైమిని ద్వారా పూర్వ మీమాంసను రచింపజేసి, తాను ఉత్తర మీమాంసను రచించి, సహాయపడ్డాడు. అంతేకాక, వేదార్థాన్ని స్పష్టంగా తెలియజేసే ఉపబృంహణ రూపమైన భారతాన్ని రచించాడు– అనే వృత్తాంతం ఇక్కడ తెలియదగినది.

"సమ్యఙ్న్యాయకలాపేన శ్రీమహాభారతేన చ,
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే"

అని శ్రుతప్రకాశికాచార్యులవారి శ్రీసూక్తులలో ఈ విషయాన్ని మనం తెలియవచ్చు. ఈ విధంగా వైలక్షణ్యాన్ని కలిగిన మహాభారతాన్ని మనం ఒక పురుషునిగా భావించి చూస్తే, శ్రీవిష్ణు సహస్రనామాధ్యాయం, శ్రీభగవద్గీత– అనే రెండు ఆ పురుషునకు రెండు కన్నుల వంటివి– అని చక్కగా బోధపడతాయి. ఇంకా బాగా లోతుగా గమనించి చూస్తే, శ్రీ విష్ణు సహస్రనామాధ్యాయం ఆ పురుషుని కుడికన్నుగానే బోధపడుతుంది.

భగవంతుని కాని, లేక అతని కల్యాణ గుణాలు, ఆశ్చర్యాన్ని కలిగించే లీలలు మొదలైనమొదలైన వాటిలో ఏదో ఒక దానిని కాని చెప్పే పదాన్ని తిరునామం అని అంటారు. ఈ తిరునామం భగవంతుని వలె మహిమ కలిగినది. భగవంతునకు పలు గొప్పతనాలు ఉన్నాయి. ఆ మహిమలలో రక్షకత్వం, భోగ్యత్వం అనేవి గొప్పవి. రక్షకత్వం అంటే– తనను ఆశ్రయించినవాని దుఃఖాన్ని తీర్చి, ఆనందాన్ని పొందినవానినిగా అతనిని చేయడం. ఈ స్వభావాన్ని ఈ క్రింది చరిత్రలో ఒక విధంగా మనం తెలియవచ్చు.

శ్రీరామ లక్ష్మణులు ఋష్యమూక పర్వతం పైకి వేగంగా ఎక్కి రావడానికి సుగ్రీవుడు చూసాడు. అతడు, వీరరసం మూర్తీభవించిన వారి రూపాన్ని చూచి, "వీరు వాలి పక్షానికి చెందినవారు" అని భయపడి పరిగెత్తుకుని పోయి దాగుకున్నాడు. ఆ సమయంలో కొందరు వానరవీరులు వారి రూపం, లీలలు మొదలైనవానిని చూసి, వారు వాలికి చెందినవారు కారు –అని ఊహించి ఆ విషయాన్ని సుగ్రీవునకు తెలియజేయగా, హనుమంతుడు భయపడిన వానరులను ఊరడించి, శ్రీరామ లక్ష్మణులను సమీపించి, ఆలోచించాడు. ఆ విధంగా వారిని సమీపించి ఆలోచించేటప్పుడు హనుమంతుని భావాన్ని ఈ క్రింది సూక్తి తెలుపుతున్నది.

"తున్బినై త్తుడైత్తు మాయ్ త్తొల్ విన్నై తన్నై నీక్కి
త్తెన్ పులత్తన్ది మీళా నెఱి యుయ్ క్కుమ్ దేవరో తామ్?"
(జన్మ దుఃఖాన్ని తీర్చి, ఆదుఃఖాకనికి హేతువైన అవిద్యను, దాని కార్యమైన కర్మను పోగొట్టి, యమలోకంలోకి కాకుండా, " నచ పునరావర్తతే" అని వేదం పలికే విధంగా మోక్షలోక మార్గంలో తనను ఆశ్రయించినవారిని చేర్చే మహావిష్ణువేనా వీరు!) అని హనుమంతుడు భావించాడు. ఈ పాశురంలో భగవంతుని రక్షకత్వం చక్కగా ప్రకాశిస్తున్నది కదా. ఈ విధంగా భగవంతుని రక్షకత్వాన్ని హనుమంతుని భావనలో ఇక్కడ గమనించాము.

ఇక, భోగత్వం అనే గొప్ప గుణాన్ని గూర్చి గమనిద్దాం. భోగ్యత్వం అంటే —మాధుర్యమే. వాల్మీకి మహర్షి కిష్కింధాకాండలో మొదట హనుమంతుని చరిత్రను చెప్పే సందర్భంలో "హనుమంతుడు శ్రీరామ లక్ష్మణులను సమీపించి, నమస్కరించి, వారి యథార్థ స్థితిని తెలియడం కోసం పలు శ్లోకాలతో కీర్తించి పలికాడు" అని అన్నారు. ఆ శ్లోకాలలో

" ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః
సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః"
అనే శ్లోకం ఒకటి. హనుమంతుడు శ్రీరాముని రూపసౌందర్యంలో ఆకర్షితుడై పలికే శ్లోకం, ఇది.

దీర్ఘమైన, గుండ్రంగా ఉండే, ఇనుప పరిఘలవలె ఉండే, సకలభూషణాల చేత అలంకరించదగిన నీ బాహువులను నీవు ఎందుకు అలంకరించుకోలేదు?— అనేది ఈ శ్లోకంలోని భావం. మన ఆచార్యులు ఈ శ్లోకానికి అందమైన అనేక భావాలను అనుగ్రహించారు.

1) భగవంతుడు ఆభరణాలకుకూడా అందాన్ని ఇచ్చే గొప్ప అందగాడు– అని పొగడబడేవాడు. హనుమంతుడు భగవంతుని ఈ స్థితిని సాక్షాత్తుగా దర్శించాడు. ఆ పరమాత్మ సన్నిధిలోనే ", ఆభరణాలకు అందాన్ని ఇచ్చే నీ బాహువులు ఎందుకు ఆభరణాల చేత అలంకరింపబడలేదు ?అని అంటున్నాడు.

2) దృష్టిదోషం తగలకుండా ఉండేటట్లు ఈ బాహువుల అందాన్ని నీవు కప్పిపుచ్చుకోవాలి కదా! మరి, ఎందుకు ఆ విధంగా అందమైన నీ ఈ బాహువులు ఆచ్ఛాదింపబడలేదు? అని అంటున్నాడు.

3) భగవంతుడు ఈ లోకంలో ఒక్కొక్క రూపంతో అవతరించి, వేంచేసి ఉండేటప్పుడు తన సాటి లేని చాలా గొప్పదైన అందం, మార్దవం, శీలం మొదలైన గుణాలను చూపించి, తనను కన్నులతో దర్శించాలి –అని ఆశపడేవారిని తన వశంగా చేసుకుంటాడు. భగవంతుని ఈ ఆశ్చర్యకరమైన స్వభావాన్ని తెలిసికొన్న జ్ఞాని, హనుమంతుడు. ఆభరణాలతో ఆచ్ఛాదింపబడిన అందమే సంసారి అయిన నీ వశంలోకి తెచ్చుకోవడానికి చాలదా? ఈ సౌందర్య ప్రదర్శనం అధికం కదా! అని అంటున్నాడు, హనుమంతుడు.

ఈ అర్థాలను చెప్పేటప్పుడు భగవంతుని భోగ్యత్వం చక్కగా ప్రకాశిస్తున్నది కదా. ఈ విధంగా భగవంతుని రక్షకత్వభోగ్యత్వాలను దర్శించాము. ఇక, తిరునామాల రక్షకత్వభోగ్యత్వాలను గమనిద్దాం.

తొండరడిప్పొడి అళ్వార్లు తిరుమాలై అనే దివ్యప్రబంధంలో భగవంతుని తిరునామాల రక్షకత్వాన్ని మొదటి పాశురంలో, రెండవ పాశురంలో భోగ్యత్వాన్ని అనుగ్రహించారు. ఆ పాశురాలు ఏవి? అంటే,

కావలిల్ పులనై వైత్తు * క్కలి తన్నై క్కడక్క ప్పాయ్ న్దు *
నావలిట్టుళ్ తరుగిన్టోమ్ * నమన్ తమర్ తలైగళ్ మీదే **
మూవులగు ఉణ్డుమిళ్ న్ద * ముదల్వ! నిన్ నామమ్ కట్ట *
ఆవలిప్పుడైమై కణ్డాయ్ * అరంగమా నగరుళానే!

** పచ్చై మామలై పోల్ మేని * పవళ వాయ్ కమల చ్చెంగణ్ *
అచ్చుదా! అమరర్ ఏఱే! * ఆయర్ తమ్ కొழுన్దే! ఎన్నుమ్ **
ఇచ్చువై తవిర యాన్ పోయ్ * ఇందిర లోకమాళుమ్ *
అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ * అరంగమా నగరుళానే!

అనే పాశురాలు.

ఈ రెండిటిలో, మొదటిది రక్షకత్వాన్ని, రెండవది భోగ్యత్వాన్ని తెలుపుతున్నవి. కామం, క్రోధం మొదలైవి కొనసాగే కాలంలో చాలా బలహీనుడైన ఈ చేతనునిచే జయించడం సాధ్యం కానివి, ఈ ఇంద్రియాలు. ఈ విధంగా ఉండే ఈ చేతనుడు పరమ పురుషుని ఆశ్రయించి, మహానందాన్ని పొందే ఉపాయం ఏది? అనే ప్రశ్న రాగా, ఐదు ఇంద్రియాలను కావలి లేకుండా, అవి ఇష్టం వచ్చినట్టు సంచరించేటట్లు వదిలి పెట్టినప్పటికీ, భగవంతుని తిరునామాన్ని అనుసంధించినందున కలిగే గర్వంచేత యమవశ్యతను పోగొట్టుకోవచ్చు, భగవంతుని పొంది తరించవచ్చు– అని అంటున్నారు, మొదటి పాశురంలో.

ఇంతకు ముందు యముని పేరు వినగానే భయపడినవారుకూడా, భగవంతుని తిరునామం అండను పొందినందు వల్ల కలిగిన బలంచేత యముని వాకిటిలోకి వెళ్లి, జయధ్వానాలను చేస్తున్నారు. ఏ విధంగా అంటే, వాలి పేరును వినగానే, భయపడి శరణు పొందిన సుగ్రీవుడు, శ్రీరాముని అండగా చేసికొన్న బలంచేత కిష్కింధాద్వారంలోకి వెళ్లి, నిర్భయంగా జయధ్వానాన్ని పలికినట్లుగా.

అక్కడ సుగ్రీవునకు నామి (నామాన్ని కలిగిన భగవంతుని) బలం, . ఇక్కడ ఆ భగవంతుని నామ బలం–. అని పెరియవాచ్చాన్ పిళ్లై అనుగ్రహించిన శ్రీసూక్తి అనుభవించదగినది.

పరమపదాన్ని ఇస్తానని భగవంతుడు ఆళ్వారులతో అన్నాడు. వారు, " అచ్చుతా! అమరరేఱే! ఆయర్ తమ్ కొழுన్దే" అనే విధంగా ఉండే ఈ రసానుభవాన్ని విడచిపెట్టి, పరమపదం ఏలే రీతిలోని ఆ రసాన్ని నీవు ఇచ్చినప్పటికీ, నేను పొందేటప్పటికీ, అందులో నాకు అపేక్ష లేదు– అని ఆళ్వార్లు ఈ రెండవ పాశురంలో అంటున్నారు.

ఈ అర్థాలను చూసినప్పుడు, భగవంతునివలె అతని తిరునామాలు కూడా రక్షకత్వభోగ్యత్వాలను కలిగినవిగా మనం చక్కగా తెలియవచ్చు కదా. ఈ విధంగా, భగవంతునకు, అతని తిరునామాలకు ఉండే సామ్యాన్ని చూచాము. ఇక, భగవంతుని కంటే తిరునామం గొప్పది– అనే విషయాన్ని గమనిద్దాం.

పెరియాళ్వారుల పుత్రిక అయిన గోదావరి తిరుప్పావై ప్రబంధంలో "ఓంగి ఉలగళంద ఉత్తమన్ పేర్ పాడి" అని అనుగ్రహించిన సూక్తి ప్రసిద్ధమైనది. " ఉత్తమనై ప్పాడి" అని అంటేనే చాలు కదా. పాడేటప్పుడు పేరు లేకుండా పాడడం వీలవుతుందా? వీలు కాదు కదా! –అని కొందరికి సందేహం కలుగవచ్చు. ఈ సందేహాన్ని తీర్చే పెరియ వాచ్చాన్ పిళ్లై శ్రీసూక్తి ఈ క్రింది విధంగా ఉన్నది.

"అవన్ తనక్కుమ్ పిఱర్ క్కుమ్ ఉండాన వాశి పోరుమ్, అవునుక్కుమ్ అవన్ తిరునామత్తుక్కుమ్. కట్టిప్పొన్ పోలే అవన్, పణిప్పొన్ పోలే తిరునామమ్. అవన్ తన్నై ఇల్లై శెయ్ కిఱవర్ కళుమ్ తిరునామమ్ కొండు కార్యమ్ కొళ్ళా నిఱ్పర్. ఆదావదు–

వ్యాధిపరిహారార్థమాక తిరునామసంకీర్తనత్తై విధిత్తాల్, అప్పోదే అద్దై శెయ్యానిఱ్పర్ కళ్. ఇని, మాతృఘాతుకనుక్కుమ్ కై నొందాల్ అమ్మే! ఎన్న ప్రాప్తి ఉండామా పోలే తిరునామమ్ శొల్లుగైక్కు ఎల్లార్ క్కుమ్ ప్రాప్తి ఉండా ఇరుక్కుమ్. తిరునామమ్ శొల్లుకైక్కు యోగ్యతై సంపాదిక్కవేండా. ఇదు తానే యోగ్యతై పనణ్ణి క్కొడుకవ*ఱ్ఱ*".

ఈ సూక్తుల భావాన్ని కొంచెం వివరిస్తాను. "ఉత్తమనై ప్పాడి" అని అంటేనే చాలు. అయినప్పటికీ, " ఉత్తమన్ పేర్ పాడి" అని అనడం భగవంతుని కంటే అతని తిరునామానికి కల గొప్పతనాన్ని చెప్పడంకోసమే. మిగిలిన వస్తువుల కంటే భగవంతుడు ఏ విధంగా చాలా గొప్ప విషయమో, గొప్పతనాన్ని కలిగినవాడో, ఆ విధంగానే, భగవంతుని కంటే అతని తిరునామం చాలా గొప్పది. ముద్ద బంగారంవంటివాడు— భగవంతుడు ఆభరణంగా చేయబడిన బంగారంవంటిది— అతని తిరునామం. ఇందువల్ల భగవంతుని కంటే అతనికి భోగ్యత అధికం— అనేది స్పష్టమవుతుంది. పరలోకం, పరమాత్మ, ధర్మం, అధర్మం అనేవి ఉన్నాయి. శాస్త్రం నిజాన్ని తెలిపే గొప్ప ప్రమాణం —అని అంగీకరించేవాడు ఆస్తికుడు అనబడుతున్నాడు. ఇతడు భగవంతుని విషయంలో ప్రేమను కలవాడై ఉంటాడు. పరలోకం మొదలైనవి లేవు— అని అనేవాడు నాస్తికుడు. ఇతడు భగవంతుని ప్రేమతో ఆదరించకుండా ఉంటాడు. అయినప్పటికీ, వ్యాధిపరిహారం కోసం తిరునామ సంకీర్తనాన్ని చేయమని ఎవరైనా ప్రేరేపిస్తే, దానిని ఆదరించి అతడు చేయడం లోకంలో స్పష్టంగా చూస్తున్నాం. దీనివల్ల భగవంతుడు ఆస్తికునిచే మాత్రమే ఆదరింపబడేవాడు. అతని తిరునామం అయితే, ఆస్తికులు, నాస్తికులు అనే తేడా లేకుండా అందరిచే ఆదరింపబడేది— అనేది చాలా స్పష్టమవుతున్నది కదా. అంతేకాక, ఇక్కడ ఫలాన్ని ఇవ్వడంలో కూడా భగవంతుని కంటే తిరునామానికి గొప్పతనం ఉన్నది— అని తెలియవచ్చు.

అయితే, తిరునామాన్ని చెప్పేటప్పుడు ప్రేమతో చెప్పనక్కర లేదా? అని అంటే, తనను కని, పెంచిన తల్లిని దైవంగా భావించి పూజించవలసిన ఒకడు, ఆ విధంగా

ప్రవర్తించకుండా, ఆ తల్లిని తన చేతితో హింసిస్తే, ఆ విధంగా హింసించినప్పుడు అతని చెయ్యి నొప్పి పుడితే, "అమ్మా! " అని అతడు అనడం చూస్తున్నాము కదా. దానివల్ల, అందరికీ తిరునామం చెప్పే యోగ్యత ఉన్నది– అనే విషయం చక్కగా బోధపడుతున్నది కదా. ఈ విధంగా గోదాదేవి దివ్యసూక్తిలో, దాని వ్యాఖ్యానం అయిన పెరియ వాచ్చాన్ పిళ్లైసూక్తిలోను తిరునామ మహిమ తెలుపబడడాన్ని గమనించాము

శ్రీ పరాశరభట్టర్ శాస్త్రాలు, బాలురు, మూగవారు అందరూ పరిగ్రహించినందువల్ల శ్రీ విష్ణుసహస్రనామాధ్యాయానికి గొప్పతనం ఉన్నది–అని అన్నారు. పరిగ్రహాతిశయం– అనేది ఆ మహనీయుల సూక్తి.

శ్రీ మహాభారతం సభాపర్వంలో "దేవో నామ సహస్రవాన్" అనే చోట భగవానునకు కూడా ఈ తిరునామ సంబంధంతో అతిశయం చెప్పబడింది.

చరకసంహితలో మేహప్రాయశ్చిత్తం, కుష్ఠప్రాయశ్చిత్తం, జ్వరప్రాయశ్చిత్తం మొదలైనవానిని చెప్పే చోట్ల సహస్రనామాన్ని కీర్తించమని చెప్పడాన్ని మనం గమనించవచ్చు.

కవులు కూడా శ్రీ విష్ణు సహస్రనామాన్ని సకలజీవరక్షకంగా వర్ణించారు అనేదానికి "అవిచ్ఛిన్నపఠ్యమాననారాయణ నామసహస్రమ్" అనే కాదంబరికవ్యంలోని వాక్యాన్ని ప్రమాణంగా చూపించారు, భట్టర్.

శ్రీ విష్ణుసహస్రనామాధ్యాయానికి కల పరిగ్రహాతిశయాన్ని ఉపపాదించే సందర్భంలో శ్రీ పరాశర భట్టర్–

లోకేశగ్రహణ ధారణశ్రవణ జపసంకీర్తన లోచన వ్యాఖ్యానతన్నిష్ఠ పూజన ప్రభృతిభిః విషపిశాచవ్యాధిగ్రహ దుస్స్వప్నదుర్నిమిత్తాద్యఖిలోపశమనాయ, మహాపాతకాది ప్రాయశ్చిత్తాయ, ఐహికాముష్మికాభ్యుదయసిద్ధయే, సంసారగ్రంథి విస్రంసనాయ వైష్ణవ పరమపదావాప్తయే, తాదాత్వికభగవద్గుణసుధాస్వాదనాయ చ ఆబాలమూకముగ్ధ స్త్రీనాస్తికైకభేషజం నిరతిశయశ్రద్ధాభక్తివిశ్వాసపూర్వకం పరిగృహ్యతే, న చైవంవిధః పరిగ్రహో వేదానామపి, తేషాం మూర్ఖాదపి అపరిగ్రహాత్"

(లోకంలో ఈ సహస్రనామాన్ని గ్రహించి, ధరించి, విని, జపించి, సంకీర్తనంచేసి, వ్రాసి, వ్యాఖ్యానం చేసి, ఇందులోనే శ్రద్ధను కలిగి, పూజించి, ఇంకా అనేక విధాలుగా విషం, పిశాచం, రోగం, గ్రహపీడ, దుస్స్వప్నం, దుశ్శకునం మొదలైన అమంగళాలు శాంతించడం కోసం, ఇహలోక పరలోకాలలో సుఖం సిద్ధించడం కోసం, సంసార బంధాన్ని తీర్చుకుని, వైష్ణవమైన పరమపదం పొందడం కోసం, పరమపదం లభించిన తరువాత కూడా భగవంతుని గుణామృతాన్ని పానం చేయడం కోసం, ఈ విధంగా అన్నిటికీ ఒకే మందుగా, బాలురు మొదలు మూగవారు వరకు, మూర్ఖులు స్త్రీలు, నాస్తికులు, ప్రేమ కలిగినవారు మొదలైన వారిచే శ్రద్ధాభక్తివిశ్వాసాలతో ఈ సహస్రనామం పరిగ్రహింపబడుతున్నది.) అని అన్నారు.

ఇంతవరకు చెప్పబడిన దానివలన భగవంతుని కంటే తిరునామానికి కల గొప్పతనం చక్కగా ప్రకాశిస్తున్నది కదా. ఈ విధంగా తిరునామానికి భగవంతునితో సామ్యం, అతని కంటే వైలక్షణ్యం ఉండడాన్ని గమనించాము.

శ్రీమహాభారతంలో ఉండే శ్రీ విష్ణుసహస్రనామాధ్యాయం, శ్రీభగవద్గీత అనే రెండు ఆ భారతానికి రెండు కన్నులు– అని, ఆ నయనాలలో, శ్రీ విష్ణుసహస్రనామాధ్యాయం కుడికన్ను– అని ఇంతకుముందే చెప్పడం జరిగింది. శ్రీ విష్ణు సహస్రనామాధ్యాయం భగవంతుని తిరునామాలనే ముఖ్యంగా కలిగినది అనేది అందరూ తెలిసిన విషయమే.

శ్రీమద్భగవద్గీత అయితే, భగవంతుని ముఖ్యధర్మంగా తెలియజేసే శాస్త్రం– అనే సంగతిని మామేకం శరణం వ్రజ" అనే చోట మనం తెలియవచ్చు. ఈ వాక్యంలో భగవంతుడు తననే శ్రేయఃసాధనంగా ఆశ్రయించి, భక్తిని కలిగి ఉండాలి– అనే శాస్త్రార్థాన్ని ఉపదేశించాడు. వీటిని నిశితంగా గమనిస్తే, శ్రీ విష్ణుసహస్రనామాధ్యాయంలో తిరునామం శ్రేయఃసాధనం– అని, శ్రీభగవద్గీతలో భగవంతుడు శ్రేయఃసాధనం– అని చెప్పబడినదని మనం తెలియవచ్చు

ఇంతకు ముందు చెప్పినట్లుగా, భగవంతుని కంటే అతని తిరునామం గొప్పతనాన్ని కలిగినదిగా ఉన్నందున, దివ్యనామాన్ని ముఖ్యంగా గ్రహించి, శ్రీవిష్ణు సహస్రనామాధ్యాయం కుడి కన్ను–< అని చెప్పడంలో అడ్డు లేదు కదా.

అందుచేత, శ్రీవిష్ణుసహస్రనామాధ్యాయం శ్రీ మహాభారతసారం– అని, దానివల్ల మహిమ కలిగినది– అని చెప్పబడినట్లయిది.

# గీతాసారం

(వాగమృతవర్షి, ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)

దాసుడు– ఈ. ఏ. శింగరాచార్యులు.

శ్రియఃపతి అయిన అయిన సర్వేశ్వరుడు పరిగ్రహించే అవతారాలు లెక్కలేనివి– అనే ఈ విషయాన్ని "అజాయమానో బహుధా విజాయతే" (కర్మ కారణంగా పుట్టకపోయినప్పటికీ, దయామూలకంగా భగవంతుడు అనేక విధాలుగా అవతరిస్తున్నాడు) అని వేదం, " బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున! " (అర్జునా! నా జన్మలు అనేకం గడిచిపోయాయి. ఆ విధంగానే, నీ జన్మలు కూడా) అని వేదవేద్యుడైన శ్రీకృష్ణుడు, "శన్మమ్ పల పల శెయ్ దు" (పలు జన్మలను ఎత్తి) అని వైదికులైన నమ్మాళ్వార్లు పలకడం ప్రసిద్ధమైన విషయం.

భగవంతుని అవతారాలు లెక్కలేనివి అయినప్పటికీ, వాటిలో దశావతారాలను పెద్దలు అనేకమార్లు అనుభవించి ఆనందించడం కూడా ప్రసిద్ధమే. .

ఆ పది అవతారాలలో కూడా, శ్రీరామకృష్ణరూపాలలో అవతరించిన భగవంతుని రూపాలను ఆ సర్వేశ్వరునిచే "మయర్వఱ మదినమ్" అనే విధంగా ఏ విధమైన దోషం లేని, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని పొందినవారైన ఆళ్వారులు, వారిని అనుసరించినవారై, అందువల్లనే అభియుక్తాగ్రేసరులైన మన పూర్వాచార్యులు కూడా చాలా అభిమానించి, అనుభవించిన విషయం కూడా ప్రసిద్ధమే.

వాటిలో కూడా, శ్రీకృష్ణావతారానికి ఉండే గొప్పతనం శ్రీరామావతారానికి లేదు– అని అంటే అది అతిశయోక్తి కాబోదు. శ్రీకృష్ణావతారానికి లెక్కలేనన్ని వైభవాలు

ఉన్నాయి. వాటిలో, గీత అనే గొప్ప శాస్త్రాన్ని అనుగ్రహించి, లోకానికి మహోపకారం చేసిన విషయం చాలా ముఖ్యమైనది.

శ్రీరామావతారంలో అనుగ్రహించిన సూక్తిగా "మిత్రభావేన సం ప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్" (మిత్రభావంతో నా దగ్గరకు వచ్చినవానిని నేను ఏ విధంగానూ వదిలిపెట్టను. అతనిలో దోషం ఉండవలసినదే. ఇది మంచివారికి గర్హించే విషయం కాదు) , " పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, అంగుళ్యగ్రేణ తాన్ హన్యాం ఇచ్ఛన్ హరిగణేశ్వర! " (సుగ్రీవా! ఈ లోకంలో ఉండే పిశాచాలను, దానవులను, యక్షులను, రాక్షసులను, నేను కోరుకుంటే, నా వేలి చివరితో సంహరించగలను) , " సకృదేవ షప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" ("నిన్ను నేను శరణాగతి చేశాను" అని, "నీ వాడను" అని ఒక్కసారి శరణాగతి చేసినవానిని నేను ప్రాణులందరినుండి అభయాన్ని కలిగిస్తాను. ఇది నా వ్రతం) అనే రెండు మూడు శ్లోకాలనుమాత్రం మన పెద్దలు మాటిమాటికి ప్రస్తావించి ఉదాహరిస్తారు. .

ఈ విధంగా రెండు, మూడు శ్లోకాలను అనుగ్రహించడం అనే అంత మాత్రమే శ్రీరాముడు చేసిన ఉపకారం. ఒక అరుదైన, పెద్ద శాస్త్రమైన గీతను అనుగ్రహించిన అతిశయం అనేది శ్రీకృష్ణునకు కల అనితర సాధారణమైన వైభవం.

"గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః,
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాత్ వినిఃసృతా"

(గీతను చక్కగా గానం చేయాలి. ఇక, వేరే శాస్త్రాలను సంగ్రహించవలసిన అవశ్యకత ఏమున్నది? ఈ గీత శ్రీకృష్ణుని ముఖపద్మం నుండి వెలువడినది) అని చెప్పబడుతున్నది కదా.

సర్వోపనిషదా గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీః భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"
(ఉపనిషత్తులు అన్నీ గోవు. ఆ గోవు దగ్గరనుండి పాలను పితికేవాడు శ్రీకృష్ణుడు. అర్జునుడే లేగదూడ పండితులు. ఆ పాలను అనుభవించేవారు. గొప్పదైన గీత అనే అమృతమే పాలు) అనే విధంగా గీతాశాస్త్రం సకల వేదాంతసారం.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన గీతలోని ఒక పరమసారార్థం ఇక్కడ గీతాసారంగా తెలియజేయబడుతున్నది.

గీత ఉపనిషత్సమాధితో "గీతా" అని స్త్రీలింగశబ్దంతోను, భగవంతుని శాసనం కనుక "శాస్త్రం" అని నపుంసకలింగ శబ్దంతోను గొప్పగా నిర్దేశింపబడుతున్నది. దీనికి ఉదాహరణగ "గీతా సుగీతా కర్తవ్యా", " గీతాశాస్త్రే సమీరితమ్" అని మొదలైన వచనాలను గమనించవచ్చు.

"న త్వేవాహం జాతు నాసమ్" అనే శ్లోకం నుండి ఆరంభించి "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే శ్లోకంవరకు ఉండే భాగం గీతాశాస్త్రం. మొదటి అధ్యాయం పూర్తిగా, రెండవ అధ్యాయంలో మొదటి 11 శ్లోకాలలతో కూడిన భాగం భగవద్గీతకు అవతారిక అనేది భగవద్యాముునుల అభిప్రాయం.

అర్జునుని శోకం, శోకనివృత్తి– అనే అర్థభేదాన్ని పురస్కరించుకొని శ్రీవేదవ్యాసభగవానుడు మొదటి అధ్యాయం, రెండవ అధ్యాయం– అని విభాగాన్ని చేశారు. అయినా, మొదటి అధ్యాయం మాత్రమే గీతలోని అవతారిక కాదు, రెండవ అధ్యాయంలో కొంత భాగంతో చేరే అవతారిక అవుతుంది– అని అంటారు, శ్రీయామునులు. దీనినిగూర్చి గీతార్థసంగ్రహంలో మొదటి అధ్యాయంలోని అర్థాన్ని సంగ్రహించి పలికే యామునులు "అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియా ౽౽ కులమ్,

పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్" అనే శ్లోకంలో ప్రథమాధ్యాయనామ నిర్దేశం చేయలేదు.

ద్వితీయాది అధ్యాయార్థసంగ్రహశ్లోకాలలో నియతంగా ద్వితీయాది అధ్యాయనామనిర్దేశాన్ని శ్రీయామునులు చేశారు. ప్రథమశ్లోకంలో ప్రథమాధ్యాయనామనిర్దేశాన్ని చేయకపోవడానికి ఏమి కారణం? అని అంటే, మొదటి అధ్యాయం, రెండవ అధ్యాయంలో కొంత భాగం కలిసి అవతారికగా ఏర్పడి ఉండడమే కారణం అవుతున్నది. ఈ విధంగా "న త్వేవాహం జాతు నాసమ్" అనే శ్లోకమే గీతాశాస్త్రంలోని మొదటి శ్లోకం అయినది.

కేశవుడైన గోవిందుడు తన నోటిని తెరచి అనుగ్రహించడం ఆరంభించిన మొదటి రెండు శ్లోకాలలో వేదాంతార్థాలలో ఏ అర్థాన్ని శ్రీకృష్ణుడు వ్యక్తం చేస్తున్నాడు? అనే విషయాన్ని కొంచెం వివరిస్తాను.

వేదం మొదలైన శాస్త్రాలను పరమప్రమాణంగా కలిగినవారు వైదికులు. వారి మతం వైదికమతం అనబడుతుంది. ఆ వైదికమతాలు ద్వైతమని, అద్వైతమని, విశిష్టాద్వైతమని మూడు విధాలుగా లోకంలో సుప్రసిద్ధలై ఉన్నాయి. వాటిలో, అద్వైతవాదులు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా ఇతి వేదాంతడిండిమమ్" అని ఘోషిస్తున్నారు. అంటే, బ్రహ్మం ఒకటే పారమార్థిక సత్యం, దానికంటే భిన్నమైన, చేతనాచేతనసమస్త పదార్థాలు అవిద్యా పరికల్పితాలు, మిథ్య, అసత్యం– అని ఈ విధంగా అంటున్నారు.

విశిష్టాద్వైతులైన మన పెద్దల సిద్ధాంతం ఏమంటే–" చితచిదీశ్వరతత్వత్రయం సత్యం, నిత్యం, పరస్పరబిన్నమై ఉన్నది. ఈశ్వరుడే పర బ్రహ్మం. అతడు చేతనాచేతనవిశిష్టుడై ఎల్లప్పుడూ ఉంటాడు"– అని.

ఈ రెండు మతాలలో గీతాశాస్త్రానుగుణమైన మతం ఏకతత్వవాదమా? లేక, తత్వత్రయ వాదమా? అనే విషయాన్ని ఇక్కడ మనం అనుభవిద్దాం.

గీతకు మూలభూతమైన వేదాంతసిద్ధాంతం ఏది? అనే విషయాన్ని ముని ముందుగా తెలియజేస్తాను.

ఉపనిషత్తులలో శ్వేతాశ్వతరోపనిషత్తు స్పష్టంగా తత్వత్రయాన్ని, వాటిలో పరస్పరం స్వరూపభేదాన్ని, చేతనాచేతన విలక్షణత్వం పరమార్థతత్వం– అనే విషయాన్ని భగవంతుని అనుగ్రహంచేత చేతనునకు పురుషార్థలాభం కలుగుతుంది– అనే విషయాన్ని తెలియజేస్తున్నది.

"సంయుక్త మేతత్ క్షర మక్షరం చ, వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః, (క్షరమనబడే ప్రకృతి, అక్షరం అనబడే జీవతత్త్వం రెండూ కలసి ఉన్నాయి. వ్యక్తంగానూ అవ్యక్తంగానూ ఉండే ఈ ఈ ప్రపంచాన్ని భగవంతుడు ధరిస్తున్నాడు) , " క్షరం ప్రధానమ్ అమృతాక్షరం హరః, క్షరాత్మానౌ ఈశతే దేవ ఏకః ", (క్షరం అంటే– ప్రధానమనే పేరు కలిగిన ప్రకృతి, అక్షరం అంటే– నిత్యమైన జీవతత్త్వం, ఈ రెండిటివీ దేవుడు ఒక్కడే శాసిస్తున్నాడు) , "జ్ఞాజ్ఞౌ ద్వౌ అజౌ ఈశనీశౌ" (జ్ఞానం కలిగిన జీవుడు, జ్ఞానం లేని ప్రకృతి రెండూ నిత్యమైనవి) , " అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాః సరూపాః", " అజో హ్యేకో జుషమాణో ఽ నుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజో ఽ న్యః", " నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్ ఏకో బహూనాం యో విదధాతి కామాన్" (నిత్యులలో నిత్యుడు, చేతనులలో పరమచేతనుడు, అద్వితీయుడు అయిన పరమాత్మ జీవులందరి మనోరథాలను అనుగ్రహిస్తున్నాడు) , , " భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా" (భోక్త అయిన జీవుని, భోగ్యమనబడే ప్రకృతిని, ప్రేరేపించేవాడైన భగవంతుని

తెలిసికొని) అని మొదలైన శ్వేతాశ్వతరవాక్యాలను నిశితంగా గమనిస్తే తత్వత్త్రయ పారమార్థికభేదవాదం వేదాంతసమ్మతం అని స్పష్టమవుతుంది.

వేదాంతాన్ని విశదీకరించడంకోసం ఆవిర్భవించిన గీతాశాస్త్రంలో ఉపక్రమప్రకరణాన్ని ఇక గమనించి చూద్దాం.

శోకావిష్టుడై, కలత చెందిన మనసు కలవాడై ఉండే అర్జునుడు "నాకు కలతను పోగొట్టి జ్ఞానాన్ని కలిగించాలి" అని శ్రీకృష్ణుని దగ్గర శరణాగతి చేసి ప్రార్థించాడు. ఈ విషయం "యత్ శ్రేయః స్యాత్ నిశ్చితం బ్రూహి తన్మే, శిష్య స్తే హం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అనే శ్లోకంలో స్పష్టమవుతున్నది.

సర్వజ్ఞుడై, పరమాత్మయై, శరణ్యుడై, ఆచార్యుడై ఉండే శ్రీకృష్ణుడు –భక్తుడై, ప్రియుడై, సఖుడై, బంధువై ఉండే అర్జునునకు ఉపదేశించేటప్పుడు ప్రారంభంలో "న త్వే వాహం జాతు నాసం న త్వం నేమే " అనే శ్లోకంలో "అహమ్" అని, ఇమే" అని జీవపరభేదాన్ని, జీవాత్మలలో పరస్పరం స్వరూపభేదాన్ని ఉపదేశించాడు. " దేహినో ऽస్మిన్" అనే అనంతరశ్లోకంలో చిదచిత్తుల భేదాన్ని ఉపదేశించాడు, కనుక, గీతాశాస్త్రసమ్మతం తత్వత్రయ వాదమే అని తెలుస్తున్నది.

"తత్వత్రయభేదం అపారమార్థికం, భేదదర్శనమే అజ్ఞానకార్యం" అనేది వేదాంతసిద్ధాంతమే అయితే, వేదాంతసిద్ధాంతనిర్ణయం చేయడానికి ముందుకు వచ్చిన శ్రీకృష్ణుడు కలత చెందిన అర్జునునకు ఆ కలతను పోగొట్టి, తెలివిని కలిగించవలసినది ఆవశ్యకమై ఉండగా, ప్రారంభంలోనే తత్వత్రయభేదాన్ని ఉపదేశించి, ఇంకా కలతచెందినవానినిగా చేయడం తగినది అవుతుందా? అనే విషయాన్ని మనం గమనించాలి.

"ఇక్కడ చెప్పబడే తత్వత్రయభేదం అవిద్యాకల్పితం, వ్యావహారికం, పారమార్థికం కాదు " అని అనడానికి లేదు. " అజ్ఞానేన తదజ్ఞానం యేషాం నాశితామాత్మనః, తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్" (5–16) అని అజ్ఞానం నశించిన తరువాత "బహుత్వం" గీతాచార్యునిచే చెప్పబడడాన్ని గమనించినవారమే అయితే, భేదం అవిధ్యా కల్పితం కాదు, పారమార్థికం– అని స్పష్టమవుతుంది. అందుచేత, తత్వత్రయభేదం పారమార్థికమని, తత్వత్రయ భేదదర్శనం జ్ఞానకార్యమని స్పష్టపడుతున్నది. ఇదే వేదాంతసిద్ధాంతం, వేద్యమతం, వైదిక దర్శనం– అనేది స్పష్టం. మరి, పిళ్లైలోకాచార్యులవారు తత్వత్త్రయగ్రంథం ఆరంభంలో "ముముక్షువైన చేతనునకు మోక్షం కలిగేటప్పుడు తత్వత్రయజ్ఞానం కలగడం ఆవశ్యకం"అని అన్నారు. విశదవాక్ శిఖామణి అయిన మణవాళ మహామునులు తేనె, పాలు, కలకండవంటి, మధురమైన వ్యాఖ్యానాన్ని ఆ గ్రంథానికి అనుగ్రహించేటప్పుడు " తత్వజ్ఞానంవల్ల మోక్షం" అని ఈ విషయం సకలసిద్ధాంత సాధారణంకదా, మోక్షంలోను, తత్వంలోనూ కదా విప్రతిపత్తి, (అంటే, మతభేదం) ఉన్నది. " "తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథా విద్యతేఽ యనాయ" (ఆ పరమాత్మను ఈ విధంగా తెలిసికొన్నవాడు మోక్షం పొందినవాడు అవుతున్నాడు మోక్షప్రాప్తికి ఇంతకంటే వేరు దారి లేదు) అని వేదాంతాలు "భగవత్తత్వజ్ఞానం ఒక్కటే మోక్షసాధనం" అని అంటూ ఉండగా, తత్వాంతరపరిజ్ఞానాన్ని వీరు మోక్షసాధనంగా చెప్పడం ఎందుకు? అని అంటే, భగవత్తత్వాన్ని తెలిసికొనేటప్పుడు, దానిని సకలచేతనాచేతన విలక్షణంగాను, వీటికి కారణంగానూ, వ్యాపకంగానూ, ధారకంగానూ, నియామకంగానూ, శేషిగాను తెలిసికోవాలి కనుక, తత్వాంతరాలను తెలియనప్పుడు ఈ విధంగా తెలిసికొనే అవకాశం లేనందువల్ల, తత్వాంతరజ్ఞానం కావాలి –అని అనడంలో ఏ లోటు లేదు. "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా" (భోక్త అయిన జీవుని, భోగ్యమైన ప్రకృతిని, జీవుని ప్రేరేపించే పరమాత్మను తెలిసికొని) , " పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్ట స్తత స్తేనామృతత్వ మేతి" (ఆత్మను, ఆ ఆత్మను ప్రేరేపించే పరమాత్మను వేరుగా

తెలిసికొని, ఆ పరమాత్మను సేవించినవాడై, ఆ కారణంచేత మోక్షాన్ని పొందుతున్నాడు) అనే (మణవాళ మహామునుల) వ్యాఖ్యాన సూక్తులను నిత్యం అనుసంధించాలి.

దేశికులు రహస్యత్రయసారంలోని తత్వత్రయచింతనాధికారం ఆరంభంలో " ప్రకృత్యాత్మభ్రాంతిః గలతి చిదచిల్లక్షణధియా, తదా జీవైక్యప్రకృతికలహః తద్విభజనాత్, అతో భోక్తా భోగ్యం తదుభయనియంతేతి నిగమైః విభక్తం నః తత్వత్రయ ముపదిశంత్యక్షతధియః" అని అన్నారు. "నిగమైః" అని ప్రమాణం, "అక్షతధియః ఉపదిశంతి" అని సంప్రదాయం చెప్పబడినవి. చెప్పబడిన అర్థం ప్రామాణికంగానూ, సాంప్రదాయకంగానూ ఉండాలి కదా.

శ్రీ విష్ణుపురాణంలో శ్రీ పరాశర భగవాన్ తత్త్వత్రయ స్వరూప స్వభావాలను చాలా స్పష్టంగా అనుగ్రహించారు– అని, వారి విషయంలో పరమాచార్యులైన శ్రీయామునులు కృతజ్ఞతా పూర్వక ప్రణామసమర్పణాన్ని చేయడం " తత్వేన యః దచిదీశ్వరతత్స్వభావ భోగాపవర్గ తదుపాయగతీ ఉదారః, సందర్శయన్ నిరమమీత పురాణరత్నం తస్మై నమో మునివరాయ పరాశరాయ " (చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు– అనే ఈ మూడు తత్వాల స్వరూప స్వభావాలను, ఇహలోక ప్రయోజనాలను, పరమపురుషార్థమైన మోక్షాన్ని, వాటి ఉపాయాల స్వరూపాన్ని చక్కగా వివరిస్తూ, పురాణరత్నం అయిన శ్రీవిష్ణుపురాణాన్ని రచించిన, గొప్ప ఔదార్యాన్ని కలిగినవారైన, మునివరులైన ఆ పరాశరులకు నమస్కారం) అనే శ్లోకంద్వారా ప్రసిద్ధమైనది.

గీతాచార్యుని అనుగ్రహం ఒకనికి కలిగింది అంటే, మొట్టమొదటగా తత్వవివేకం కలుగుతుంది. అచిద్విలక్షణుడు జీవాత్మ– అనే ప్రకృత్యాత్మవివేకంతో ప్రకృత్యాత్మభ్రాంతి తొలగిపోతుంది. జీవవిలక్షణుడు పరమాత్మ– అనే జీవపరవివేకంతో జీవైక్య కలహం నివృత్తమవుతుంది. జీవుడు జ్ఞాత కనుక అచిద్విలక్షణుడు అవుతున్నాడు, భగవంతునకు శేషభూతుడు కనుక, శేషి అయిన

భగవంతుని కంటే వేరైనావాడు అవుతున్నాడు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలో "అడియేనుళ్ళాన్" (8–8–2) అని జీవపర భేదాన్ని, "శెన్ఱు శెన్ఱు పరంపరమాయ్ (8–8–5) అని దేహాత్మభేదాన్ని స్పష్టంగా తెలియజేశారు కదా.

జీవాత్మస్వభావాలైన జ్ఞాతృత్వ, శేషత్వాలు రెండిటిలోనూ శేషత్వమే ప్రబలం. శేషత్వం లేనప్పుడు స్వరూపం లేదు. ఈ విషయం భాసించేటట్లు ప్రణవంలో ముందుగా అకారంపై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తి శేషత్వాన్ని తెలుపుతున్నది. తరువాత మకారం జ్ఞాతృత్వాన్ని తెలుపుతున్నది. శ్రీవేదవ్యాసులు కూడా శారీరకశాస్త్రంలో మొదటి అధ్యాయంలో జీవాత్మ స్వరూపం భగవంతునకు శేషమై ఉండడమే– అని తెలియజేసి, తరువాతే, రెండవ అధ్యాయంలో "జ్ఞో ఽ త ఏవ" అని జ్ఞాతృత్వాన్ని తెలియజేశారు. "న హి మే జీవితేనార్థః" అని సీతాదేవి, "ఏఱాళు మిఱైయోనుమ్" అనే దశకంలో నమ్మాళ్వారులు, " న దేహం న ప్రాణాన్" అని స్తోత్రరత్నంలో శ్రీయామునులు భగవచ్ఛేషత్వం లేనప్పుడు ఆత్మ– ఆత్మీయాలు విడువ తగినవి– అని పలికి శేషత్వప్రాధాన్యాన్ని బలపరచారు. తిరుక్కోటియూర్ నంబి శ్రీపాదాలలో ఆరు నెలలు సేవించి, కూరేశులు నిధిగా పొందిన అర్థం ఇదే కదా.

ఇటువంటి ఈ తత్వత్రయభేదాన్ని గీతాచార్యుడు "న త్వేవాహమ్, " దేహినో ఽ స్మిన్" అనే రెండు శ్లోకాలలో తెలియజేశాడు. " దర్శనం భేద ఏవ చ" అని కదా, వరదరాజస్వామి సిద్ధాంతం.

అహంకారం ఒక చండాలుడు. మమత అతని భార్య. రాగద్వేషాలు వారు కన్న పుత్రులు. . అహంకారం అనే ఒక్కదానిని పోగొట్టుకుంటే మమత, రాగద్వేషాలు నశించిపోతాయి. అహంకారం అనే భర్త నశిస్తే, అతని భార్య అయిన మమత అతని విరహం వల్ల అనుమరణాన్ని పొంది, నశిస్తుంది. మమత అయిన తల్లి నశిస్తే, స్తన్యాన్ని ఇచ్చేవారు ఎవ్వరూ లేనందున, ఆమె కుమారులైన రాగద్వేషాలు నోరు ఎండిపోయి,

నశిస్తాయి. అందుచేత సర్వానర్థమూలమైన అహంకారాన్ని నశింప చేసికోవాలి— అనేది చాలా ఆవశ్యకమైన విషయం.

అనాత్మ అయిన దేహాన్ని ఆత్మగా అభిమానించడం కూడా అహంకారమే. అనీశ్వరుడైన తనను ఈశ్వరునిగా అభిమానించడం కూడా అహంకారమే. ఈ రెండు దేహాత్మాభిమానం, స్వతంత్రాభిమానం అని చెప్పబడుతున్నాయి. ఈ రెండు నశించగా, తత్వత్రయ వివేకం కలుగగా, శ్రీకృష్ణుడు గీతోపదేశం చేస్తాడు.

అழగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యవర్యులు ఆచార్యహృదయం అనే గ్రంథంలో 18 గీతార్థాలు తత్వవివేకాన్ని మునుముందుగా అనుగ్రహించారు.

"మయర్వఱ మదినలమ్" (ఏ దోషం లేని, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని) భగవంతుని నిర్హేతుక కృపతో పొందిన అళ్వార్లు సర్వేశ్వరుడు తమకు తత్వవివేకాన్ని కలిగించిన విషయాన్ని మహోపకారంగా అనుసంధించి, ఆనందిస్తారు.

తత్వత్రయ పారమార్థికభేదం గీతాశాస్త్రంలో ఉపక్రమ ప్రకరణంలో మాత్రమే కాకుండా, శాస్త్రంలో అంతటా ఆమ్రేడితమైనది.

గీతాచరమశ్లోకంలో "అహం" అని, "త్వా" అని, "మోక్షయిష్యామి" అని శ్రీకృష్ణుడు పలికాడు. బద్ధుడై, అజ్ఞుడై, అశక్తుడై, అపూర్ణుడై, అప్రాప్యుడై ఉండే అభిముఖుడైన చేతనుని "త్వా" అనే శబ్దంతోను, ముకుందుడై, సర్వజ్ఞుడై, సర్వశక్తియై, పూర్ణుడై, ప్రాప్యుడై ఉండే సర్వేశ్వరుడైన తనను "అహం" అనే శబ్దంతోను, బంధకమైన విరోధిని, దాని నివృత్తిని "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అనే వాక్యంతోనూ చెప్పినందున, శ్రీకృష్ణుడు తత్వత్రయభేదాన్ని తెలిపినవాడు అయ్యాడు కదా. ఈ

విధంగా, చేతనాచేతనాలు శేషమై, వ్యాప్యమై, దార్యమై, నియామ్యమై ఉంటాయి, భగవంతుడు శేషియై, వ్యాపకుడై, ధారకుడై, నియంతయై ఉంటాడు –అనే జ్ఞానమే యథార్థం జ్ఞానం అవుతుంది. ఇదే గీతాసారం.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో పాండవ కౌరవసేన మధ్యలో అర్జునుని రథంతొట్టిలో గీతాచార్యుడు ఉపదేశించిన తత్త్వత్రయ పారమార్థిక భేదవాదాన్నే హస్తిగిరిలోని వరదరాజస్వామి "దర్శనం భేద ఏవ చ" అని అనుగ్రహించాడు.

విభవావతారమైన శ్రీకృష్ణునకు ప్రతినిధిగా తిరువల్లి క్కేణి అనే దివ్యక్షేత్రంలో శ్రీపార్థసారథియై, అర్చావతారంగా సేవను అనుగ్రహించే భగవంతుడే శేషి, శరణ్యుడు– అని, మనం అతనికి శేషభూతులం, అతనినే అతనినే ఉపాయంగా, ఉపేయంగా కలిగినవారం –అని తెలిసికొని, దానికి తగిన అనుష్ఠానంతో వర్తిదాం.

ప్రమాణమైన గీతను, ప్రమేయమైన శ్రీపార్థసారథిని, ప్రమాతలు అయిన అళ్వార్లను "వాళ్గి! వాళ్గి! వాళ్గి! " అని మంగళాశాసనం చేసి, విరమిస్తాను.

# స్తోత్రరత్నవైభవమ్

(వాగమృతవర్షి, న్యాయవేదాంత విద్వాన్, ఉ. వే. శ్రీమాన్. వేళుక్కుడి వరదాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)
దాసుడు ఈ. ఏ. శింగరాచార్యులు.

"లక్ష్మీనాథసమారంభామ్" అనే శ్లోకరత్నంలో నాథయామునులను మధ్యమణిస్థానీయులుగా అనుసంధించారు, శ్రీకూరేశులు. ఈ ఇద్దరు మహాచార్యులు. తాతగారు, మనుమడు. వీరు ఇద్దరూ కాట్టుమన్నార్ గుడి అనే దివ్యదేశంలోనే అవతరించారు అనేది సుప్రసిద్ధం. శ్రీమన్నాథమునులకు తరువాత, భగవద్రామానుజులకు ముందు దర్శన నిర్వాహన్ని చేసిన మహాచార్యులు, శ్రీయామునులు. వీరు అవతరించిన తిరునక్షత్రమే కదా ఆడి మాసంలోని ఉత్తరాషాఢ. శూన్యమాసం అయిన ఆడిమాసాన్ని అశూన్యంగా చేసినవారు కదా– తిరువాడిప్పూరం నక్షత్రంలో అవతరించిన గోదాదేవి, ఉత్తరాషాఢా నక్షత్రంలో అవతరించిన శ్రీయామునులు కూడా –అని అంటారు పెద్దలు. భగవద్యామునుల కటాక్ష సౌభాగ్యంవల్లనే భగవద్రామానుజులు జగదాచార్యులుగా ప్రకాశించారు– అనేది సత్యంలో సత్యం కదా. " పాషియత్తై ఈడేఱ ప్పార్వై శెయ్ దాన్ వాళ్గియే" (శ్రీ భాష్యం పూర్తి అయ్యేటట్లు కటాక్షించినవారికి మంగళం) అని కదా శ్రీయామునుల మంగళాశాసనం. శ్రీరామానుజులను కాంచీపురంలో శ్రీయామునులు కటాక్షించిన విషయం "ఆమ్ ముదల్వన్ ఇవన్" అనే తిరువాయ్ మొళ్గి ప్రబంధంలోని పాశురవ్యాఖ్యానంలో స్పష్టమవుతున్నది. ద్రోణాచార్యునకు ఏకలవ్యునివంటివారు, శ్రీయామునులకు భగవద్రామానుజులు. శ్రీయామునులు అనుగ్రహించిన సిద్ధిత్రయం లేకపోయినట్లయితే భగవద్రామానుజుల శ్రీభాష్యం లేదు, ఆళవందార్ అనుగ్రహించిన గీతార్థసంగ్రహం లేకపోయినట్లయితే శ్రీ రామానుజుల గీతాభాష్యం లేదు –అనే రీతిలోని వైభవాన్ని

కలిగినవారు, శ్రీయామునులు. అటువంటి యామునులు అనుగ్రహించిన స్తోత్రరత్నాన్నిగూర్చి ఇక్కడ కొంచెం మనం అనుభవిద్దాం.

భగవత్పరాలుగా భగవద్రామానుజులు, కూరేశులు, భట్టర్, దేశికులు మొదలైనవారు అనుగ్రహించిన స్తోత్రాలకు అన్నిటికీ మూలమై ఉన్నది, ఈ స్తోత్రరత్నం. మంత్రాలలో రత్నమైన ద్వయాన్ని మంత్రరత్నం– అని అన్నట్లు, పురాణాలలో రత్నమైన శ్రీవిష్ణుపురాణాన్ని పురాణరత్నం– అని అన్నట్లు, స్తోత్రాలలో రత్నమైన దీనిని స్తోత్ర రత్నం– అని పెద్దలు అంటారు.

ఈ స్తోత్రరత్నంలోని ప్రమేయం ఏమంటే, అళ్వారుల ద్రవిడోపనిషత్అయిన తిరువాయ్ మొ*ఝ్*లోని రహస్యమే. భగవత్కైంకర్యం గొప్ప పురుషార్థం– అనే అర్థమే ఇది. దీనిని ఆళ్వారుల నిర్హేతుకమైన అనుగ్రహం వల్ల శ్రీనాథమునులు పొందారు.

ఈ అర్థాన్ని, నాథమునులు, ఉయ్యక్కొండార్, మణక్కాల్ నంబి అనే ఆచార్యుల పరంపరద్వారా శ్రీయామునులు పొంది, ఈ స్తోత్రంలో వ్యక్తం చేశారు. అంతేకాక, సకల వేదాంతసారార్థాలైన ప్రాప్యప్రాపకాలను నిశ్చయించి, ఈ స్తోత్రరత్నంతో ప్రాపకాన్ని, అంటే, ఉపాయాన్ని, ప్రాపకంగా అధ్యవసించి, ప్రాప్యాన్ని, అంటే, పురుషార్థాన్ని ప్రార్థిస్తున్నారు– అని చెప్పవచ్చు. ఆళ్వారుల తిరువాయ్ మొ*ఝ్* ప్రబంధం ప్రాప్యపరమని, ప్రాప్యప్రాపక పరమనే నిర్వాహాలు అనేకం ఈడు మొదలైన గ్రంథాలలో తెలియజేయబడ్డాయి. ఆ విధంగానే, ఈ స్తోత్రరత్నాన్ని కూడా మన పూర్వాచార్యులు అనేక విధాలుగా నిర్వహించారు.

స్తోత్రరత్నంలో ముందుగా యామునులు " నమః" అని ఆరంభించి, ఉపకారకులను నమస్కరించి, "యన్మూర్ధ్ని" అని ఆరంభమయ్యే శ్లోకంలో "మే మూర్ధ్ని భాతి " అని భగవంతుని ఉపాయత్వాన్ని, " శ్రుతిశిరస్సు భాతి" అని అతని

ప్రాప్యత్వాన్ని సంగ్రహించి అనుగ్రహించారు కదా. ఈ శ్లోకమేకదా గ్రంథప్రతిపాద్యసంగ్రహం.

"తత్త్వేన" అని ఆరంభించి, "భగవద్విషయాన్ని స్తోత్రం చేయడానికి తాను అయోగ్యుడను"– అని నైచ్యాన్ని భావించి, "కాణు మళవుమ్ శెల్లుమ్ కీర్తియాయ్" అనే విధంగా వారు, వారు తమ తమ జ్ఞానానికి తగినట్లు కీర్తించవచ్చు– అని నిశ్చయించుకొని, స్తోత్రంలో ప్రవేశిస్తున్నారు. " నావేక్షసే" అని ఆరంభించి, భగవంతుని పరత్వసౌలభ్యాలను విస్తృతంగా వివరించి, " న ధర్మనిష్ఠో ౽ స్మి" అని ఉపాయంతరత్యాగ పూర్వకంగా శరణాగతిని చేశారు. " విరాజమాన" అని ఆనందించి, భగవానుని దివ్యమంగళవిగ్రహ దివ్యాభరణ దివ్యాయుధ దివ్యమహిషీ నిత్యముక్తవిశిష్ట బ్రహ్మానుభవాన్ని, అనుభవ జనిత ప్రీతికారిత కైంకర్యాన్ని, అది కూడా, పరార్థం అనే విషయాన్ని వ్యక్తం చేసి, ప్రాప్యాన్ని తెలియజేశారు. నమ్మాళ్వారులు "వళవేழులకు" (తిరువాయ్ మొழி–1–5) అనే దశకంలో తల ఎత్తిన నైచ్యాను సంధానంవల్ల భగవంతునకు దూరం కావాలని చూచినట్లుగానే, వీరు కూడా "ధిగశుచిమ్ " అని అంటూ దూరం కావాలని చూశారు. కానీ, రుచిలోని ఆధిక్యంచేత దూరంగా పోలేక, నిలచిపోయారు భగవంతుని పరత్వంలోని అవధిని చూచి దూరం కావడం, భగవంతుని సౌలభ్యావధిని చూచి దగ్గర కావడం ఉచితమే కదా. ఇదే కదా "వళవేழులకు" అనే దశకంలోని సారం. " కణ్ గళ్ శివందు" (8–8) అనే దశకంలో జీవాత్మ స్వరూపం భగవంతునకు శేషమై ఉండడం– అని నిరూపించి, " కరుమాణిక్క మలై" (8–9) అనే దశకంలో అది అనన్యార్హం– అని నిరూపించి, " నెడుమాఱ్కడిమై" (8–10) అనే దశకంలో భగవచ్ఛేషత్వపర్యంతంలోనే కాదు, భాగవతశేషత్వంవరకు కొనసాగాలి– అని అళ్వార్లు అనుగ్రహించారు. ఇది కదా శ్రీరామాయణపురుషులలో శ్రీశత్రుఘ్నాழ்వాన్ ప్రకారం. ఆ విధంగానే శ్రీయామునులు కూడా, "తవ దాస్యసుఖైకసంగినామ్" అని తదీయశేషత్వాన్ని ప్రార్థించారు. బ్రహ్మజన్యంకూడా పరిపూర్ణం కాదు– అని భావించేవారికి గడచిన కాలంలోని జన్మ "ఉణ్ణాట్టు త్తేశు" – పరమపదంలోని తేజస్సు

కదా. (అందువల్ల తదీయశేషత్వానికి పనికి వచ్చే ఈ లోకంలోని జన్మను ప్రార్థించారు) . తమ పితామహులైన శ్రీ నాథమునుల సంబంధాన్ని నిర్దేశించి, స్తోత్రాన్ని పూర్తి చేశారు.

ఐశ్వర్య కైవల్యాలు స్వరూపానికి తగిన పురుషార్థాలు కాదు, భగవదనుభవ కైంకర్యాలే స్వరూపానురూపమైన ఫలం –అని, కర్మజ్ఞానభక్తులు స్వరూపవిరుద్ధాలు– అని, భగవంతుడే ఉపాయభూతుడు అని ఆళ్వారులు తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో నిశ్చయించారు. "ఒరు నాయకమ్ (4–1) అనే దశకంలో ఐశ్వర్య కైవల్యంలోని ప్రావణ్యం తగదు– అని ఇతరులకు ఉపదేశించిన అళ్వార్లు, "నణ్ణాదార్" అనే దశకంలో " "ఐంగరువి కండ ఇన్బమ్ అళవిల్లా చ్చి*ற்றி*న్బమ్ ––– ఒండొడియాళ్ తిరుమకళుమ్ నీయుమే నిలా నిఱ్ప కండ శదిర్ కండు ఒ*ழி*న్దేన్" (పంచేంద్రియాల వల్ల కలిగే ఇహలోకాలలోని సుఖాన్ని, అంతు, లేనిది, చాలా తక్కువది అయిన ఆత్మానుభవాన్ని కాదని, అందమైన చేతి గాజులను కలిగిన కలిగిన లక్ష్మీదేవి, నీవు కలసి వేంచేసి ఉండగా, దర్శించి ఆనందించాను) అని ఐశ్వర్య కైవల్యాలను తాము విడచి పెట్టినట్లుగా స్వానష్ఠానాన్ని చూపించారు. పురుషార్థఫలాన్యరుచి పోవడమే కదా, తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో నాలుగవ శతకంలోని ప్రమేయం. " నో*ற்ற* నోన్బు" ఇత్యాదిగా కర్మజ్ఞానాధులను విడిచిపెట్టి, " ఉన్నడి క్కీ*ழ்* అమర్ న్దు పుగుందేనే" (6–10–10) అని సర్వేశ్వరుని ఉపాయంగా అళ్వార్లు ఆశ్రయించారు. వారిని అనుసరించివారైన శ్రీయామునులు కూడా, ఆ అర్థాన్నే కదా ఈ స్తోత్రంలో వ్యక్తం చేశారు. భగవత్కైంకర్యం ప్రాప్యం అయినా, ఆ కైంకర్యానికి ప్రతిసంబంధి కనుక భగవానుడు ప్రాప్యం అవుతున్నాడు. ఆ భగవంతుని ఆశ్రయంగా కలిగినవాడు కనుక, జీవుడు కూడా ప్రాప్యం అవుతున్నాడు. ఆ కైంకర్యాన్ని వర్ధిల్లచేసేది కనుక, పరమపదం కూడా ప్రాప్యం అవుతున్నది. దానికి విరోధి అయిన ప్రకృతిసంబంధం యొక్క నివృత్తి కూడా ప్రాప్యం అవుతున్నది. ఇవి అన్నీ కూడా కైంకర్యం కోసం కదా. ఇవి భగవద్భాగవత కైంకర్యోపయోగి కానప్పుడు అన్ని త్యాజ్యమే కదా. ఈ అర్థాన్ని "న దేహమ్" అనే శ్లోకంతో యామునులు వ్యక్తం చేశారు. ఈ అర్థాన్ని నమ్మాళ్వారులు "ఏఙాళుమ్

ఇళైయోనుమ్" అనే దశకంలో నిరూపించి చూపించారు కదా. లక్ష్మీనాథుని ఆనందానికి కాకుండా పోతే, నా గొప్పవైన ఆత్మాత్మీయాలు ఏనాటికీ నాకు అక్కరలేదు– అని దీని తాత్పర్యం. " న హి మే జీవితేనార్థః ––– వినా రామం మహారథమ్" అని అన్నది కదా, సీతాదేవి. "జీవితాదికళాల్ కుఱైయిన్ఱి" అని సంకలనం చేశారు, ఆచార్యహృదయ గ్రంథంలో నాయనార్. అందుచేత శేషత్వమే పురుషార్థం– అని చెప్పినట్లయినది. అష్టాక్షరిలోని ప్రణవంలో కల అకారం పై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తిలో, ఆ విధంగానే, "నారాయణాయ" అనే పదం చివర కల వ్యక్తచతుర్థిలోను చెప్పబడిన శేషధర్మ –శేషవృత్తులైన నిరుప్యనిరూపకభావం సంప్రదాయ సిద్ధంకదా. " కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే" (నన్ను సేవకునిగా చేసుకో. ఇందులో ధర్మలోపం ఏమీ లేదు) అని అన్నాడు కదా, లక్ష్మణుడు. నాకించిత్ కుర్వతః శేషత్వం కదా. శేషత్వం లేలేనప్పుడు స్వరూపం లేదు– అని అన్నందున ప్రణవంలో చెప్పబడిన శేషత్వం జీవాత్మస్వరూప నిరూపకం. ప్రణవంలోని మూడవ అక్షరం అయిన మకారంచేత చెప్పబడిన జ్ఞాతృత్వం కంటే శ్రేష్ఠం, శేషత్వం– అని చెప్పబడినట్లయినది.

భగవచ్ఛేషత్వం భాగవతశేషత్వపర్యంతంగా కావాలి కదా పతివ్రతకు భర్త దేహం ఉద్దేశం అయితే, పాతివ్రత్యభంగం లేదు. ఆ విధంగానే, భగవంతునకు శరీరభూతులైన శ్రీవైష్ణవుల విషయంలో కించిత్కారత్వంచేత ఇతనికి స్వరూపహాని లేదు కదా. శ్రీవైష్ణవులు భగవంతునకు జంగమశ్రీవిమానాలు కదా. "నెంజమే నీణగరాక" (భక్తుని మనసే విశాలమైన నగరంగా కల భగవానుడు) దానిని ఒక్క క్షణం కూడా విడిచిపెట్టడు కదా ఆళ్వారులు "ఊనిల్ వాழுయిర్" దశకంలో భగవదనుభవాన్ని పొంది, ఆనందించినవారై, "అడియార్ గళ్ కుழாఙ్గళై ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో" (భగవద్భక్తుల సమూహాలతో కలసి ఉండడం ఏనాడో కదా) అని భగవదనుభవాన్ని ఆశపడి, " నెడు మాఱ్కడిమై" అనే దశకంలో దానిని పొంది, పరమానంద భరితులయ్యారు. భాగవతానుభవం లేనప్పుడు ఏర్పడిన భగవదనుభవం అపూర్ణం కదా. శ్రీయామునులు కూడా స్తోత్రరత్నంలో ఈ అర్థాన్ని అనుగ్రహించారు– అనే

విషయం ఇంతకుముందే చెప్పబడింది. పరమాత్మయొక్క సగుణతత్వం, సవిగ్రహవత్వం, ఉభయవిభూతియుక్తయుక్తతత్వం— అనే విశిష్టద్వైతసిద్ధాంత సారార్థాలను శ్రీయామునులు ఈ స్తోత్రరత్నంలో వ్యక్తం చేశారు— అనేది కూడా ఇంతకుముందే చెప్పబడింది. " ప్రహర్షయిష్యామి" అని అనడంద్వారా పరార్థకైంకర్యమే పరమపురుషార్థం— అనే సంప్రదాయతాత్పర్యాన్ని నిశ్చయించారు, ద్వయంలోని ఉత్తర వాక్యంలో నమశ్శబ్దం కైంకర్యంలోని విరోధిని పోగొడుతున్నది. ఇక్కడ విరోధి అంటే— తనకోసం— అని చేసే కైంకర్యం— అని కదా పూర్వాచార్యులు నిశ్చయించారు. " స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద" (నీవే స్వయంగా నీకిష్టమైన చోట ఆశ్రమాన్ని నిర్మించు – అని నన్ను ఆజ్ఞాపించు) అని అన్నాడు కదా, లక్ష్మణుడు కూడా. " తనక్కే యాగ ఎనై క్కొళ్ళు మీదే ఎనక్కే కణ్ణనై యాన్ కొళ్ శిఱప్పే" (తనకోసంగానే నన్ను పరిగ్రహించడం అనే ఇదే నా స్వరూపానికి తగిన, భగవంతుని విషయంలో నేను కోరే గొప్ప ప్రయోజనం) అని ఆళ్వార్లు, " మ*ఱ్ఱై* నమ్ కామంగళ్ మా*ఱ్ఱు*" (నీ కైంకర్యం కంటే వేరైన ఆశలను మాకు లేకుండా నీవు చేయాలి) అని గోదాదేవి, "ఐంబుల నకత్తడక్కి" (ఐదు ఇంద్రియాలను లోపల నియంత్రించి) అని తొండరడి ప్పొడి అళ్వార్లు పలికిన దివ్య సూక్తులను విచారిస్తే, ఇది అంతా వ్యక్తం అవుతుంది. " ప్రాప్తావుమ్, ప్రాపకనుమ్, ప్రాప్తిక్కు ఉగప్పానుమ్ అవనే" (పొందేవాడు, పొందించేవాడు, ప్రాప్తికి సంతోషించేవాడు ఆ భగవంతుడే) అని శ్రీ పిళ్లైలోకాచార్యులవారి సిద్ధాంతం కదా. " "ఆహమన్నాదః" (నేను అన్నం అనబడే భగవంతుని అనుభవిస్తున్నాను) అనే తన భోక్తృత్వానికి ముందే "అహమన్నమ్" (నేను, భగవంతుడు అనుభవించే అన్నం వలె భోగ్యమైన పదార్థాన్ని) అని తన భోగ్యత్వాన్ని కదా ముక్తుడు పలుకుతున్నట్లు శ్రుతి చెబుతున్నది. భోక్తృత్వం కూడా భోగ్యం కోసమే కదా. "భుంక్తే స్వభోగమఖిలం పతిభోగశేషమ్" (భర్త అయిన భగవంతుడు అనుభవించగా మిగిలిన భోగశేషాన్ని అంతటినీ ముక్తపురుషుడు అనుభవిస్తున్నాడు) అని చెప్పబడుతున్నది కదా.

ఇటువంటి పురుషార్థానికి ఉపాయంగా ఆ భగవంతుని ఆశ్రయించారు, శ్రీయామునులు. " న ధర్మనిష్ఠో ౽ స్మి" అని శ్రీయామునులు కర్మజ్ఞానాదులను విడచిపెట్టడానికి అజ్ఞాన ఆశక్తులు కారణాం కాదు. అవి స్వరూపవిరుద్ధాలు– అని కదా విడచి పెట్టారు. శ్రీయామునులకు ఉపాయంతరజ్ఞానం ఉపాయంతరానుస్థానశక్తి ఉన్నదని చెప్పలేము కదా. " ఉపాయంతరజ్ఞానం, ఉపాయంతరానుష్ఠానశక్తి ఉన్నప్పటికీ, ఫలం కలగడంలో ఆలస్యం సహించలేనందున శ్రీయామునులు వాటిని విడచి పెట్టి, భగవంతుని ఉపాయంగా ఆశ్రయించారు. భక్తి మొదలైన ఉపాయంతరాలు ప్రాప్తకర్మావసానంలో ఆలస్యంగా కదా ఫలిస్తాయి –అని చెప్పడానికి వీలు లేదు. అవతారరహస్యజ్ఞాన సహకృతమైన భక్తిరూపమైన ఉపాయంతరం దేహావసానంలో ఫలిస్తుంది– అనే ఈ మాట "ఏవం యో వేత్తి తత్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి" (ఈ విధంగా ఎవడు నా ఈ అవతారరహస్యజ్ఞానాన్ని యథాతథంగా తెలిసికొంటాడో, అతడు ఈ దేహాన్ని విడచిపెట్టి, మళ్ళీ తిరిగి జన్మించడు, నన్ను చేరుతాడు) అని గీతాచార్యుడు అనుగ్రహించాడు. ఆ మార్గంలో కూడా ప్రయత్నించకుండా, శ్రీయామునులు భగవంతునే ఉపాయంగా ఆశ్రయించడం ఎందుకంటే, ఉపాయంతరసామాన్యం అప్రాప్తం, అంటే, స్వరూపానికి తగినది కాదు– అని. " ప్రాపకాంతర పరిత్యాగానికి అజ్ఞాన, ఆశక్తులు కారణం కాదు, స్వరూప విరోధమే ప్రధాన హేతువు" అనికదా, శ్రీవచన భూషణనిష్కర్షం. అందుచేతనే గీతాచార్యుడుకూడా విధిరహస్యంలో ఉపాయంతర పరిత్యాగాన్ని "పరిత్యజ్య" అని విధించాడు. "స్నాత్వా భుంజీత" – స్నానం చేసి భుజించాలి– అనే విధంగా ఉపాయంతరాలను విడచే, భగవంతుని ఆశయించాలి– అని కదా సంప్రదాయనిష్కర్షం.

స్తోత్రరత్నంలో మొదట, చివర కూడా తమకు పితామహులైన శ్రీమన్నాథమునులను శ్రీయామునులు నిర్దేశించారు. కాట్టుమన్నార్ కోయిల్ గోపాలరత్నాన్ని తనకు అనుగ్రహించిన మహోదారులైన ఆచార్యులు– అని మొట్టమొదటగా మూడు శ్లోకాలతో శ్రీమన్నాథమునులను వారు స్తుతించారు, " తమ

శరణాగతి అయిన సత్కర్మను కూడా అనాదరించి, శ్రీమన్నాథమునుల సంబంధమనే ఏ లోటు లేని ఉపాయాన్ని చూచి, దాసుని కటాక్షించాలి" అని శ్రీ నాథమునుల సంబంధాన్ని విన్నపించి, స్తోత్రరత్నాన్ని శ్రీయామునులు పూర్తి చేశారు. "తనమాయ తానే కైకూడుమ్" (ధనం అనేది తానే సమకూడుతుంది) అని శ్రీ వైష్ణవధనమైన జ్ఞానభక్తివైరాగ్యాలతో, భగవత్కైంకర్య సామ్రాజ్యంతో తేడా లేకుండా, అన్నీ ఆచార్యాధీనం– అని దీని అర్థం.

ఆచార్య వైభవంతో ఆరంభించి, ఆచార్యవైభవంతో ముగించే భగవత్ స్తోత్రమే కదా, స్తోత్ర రత్నం.

## శుక్లాంబరధరం విష్ణుమ్

(న్యాయవేదాంతవిద్వాన్, శ్రీవైష్ణవసింహ, ఉ. వే. శ్రీమాన్ టి. ఏ కృష్ణమాచార్యస్వామివారి 【తిరుపతి】 ద్రావిడవ్యాసం ఆధారంగా)

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే"

శుక్ల +అంబరధరం= తెల్లని వస్త్రాన్ని ధరించినవాడు, శశివర్ణం =చంద్రుని రంగువంటి రంగును కలవాడు, చతుర్భుజం= నాలుగు చేతులను కలవాడు, ప్రసన్న వదనం =స్వచ్ఛమైన ముఖాన్ని కలవాడు అయిన, విష్ణుం =శ్రీమన్నారాయణుని, సర్వవిఘ్న +ఉపశాంతయే =అన్ని ఆటంకాలు తీరడం కోసం, ధ్యాయేత్= ధ్యానించాలి.

ఈ శ్లోకం, శ్రీమన్నారాయణుని తప్ప దేవతాంతరాలను కొలువని విష్ణుభక్తులు అందరూ వైదిక కార్యాలను ఆరంభించే సమయంలో అనుసంధించే శ్లోకం. ఈ విధంగా వైష్ణవులు మాత్రమే అనుసంధించే శ్లోకం కనుక, ఈ శ్లోకం శ్రీమన్నారాయణుని గూర్చినదే –అనే విషయాన్ని నిశ్చయించుకోవడంలో అడ్డు లేదు. ఇందులో "విష్ణుః" అనేది విశేష్యం, మిగిలిన నాలుగు పదాలు విశేషణాలు.

ఈ విష్ణుశబ్దం, చతుర్భుజశబ్దం కూడా శ్రీమన్నారాయణుని మాత్రం నిర్దేశించే యోగరూఢశబ్దాలు. అమరకోశంలో మొట్టమొదటనే స్వర్గవర్గలో 18 వ శ్లోకం నుండి ఆరంభించి వరుసగా 12 శ్లోకాలలో నిర్దేశింపబడిన, విష్ణువునకు మాత్రం వాచకాలైన 39 శబ్దాలలో విష్ణుశబ్దం, చతుర్భుజశబ్దం పఠింపబడడంచేత ఈ రెండు విష్ణువును మాత్రమే తెలియజేస్తాయి– అని అనడంలో ఏ సందేహం లేదు.

ఇంతేకాక, ఈ విష్ణుశబ్దం విష్ణుగాయత్రి అనే ప్రసిద్ధమైన "నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్" అనే మంత్రంలో నారాయణ, వాసుదేవ శబ్దాలతో ఏకార్థకం అయినదని విష్ణుశబ్దాన్ని ప్రస్తావించడం చేత, ఆ రెండిటికీ వేరు అర్థాన్ని చెప్పడం సాధ్యం కానట్లుగానే, దీనికి కూడా శ్రియఃపతి అనే అర్థన్నే చెప్పి తీరాలి. ఈ విషయం ఎవరూ కాదనడానికి సాధ్యం కానిది.

ఇక, ఈ శ్లోకంలోని మిగిలిన విశేషణాలను గమనిద్దాం.

**(ప్రసన్నవదనమ్)** లక్ష్మీనాథుడు సత్వగుణమే మూర్తీభవించిన దేవతాసార్వభౌముడు కనుక, దాని గుణాలైన జ్ఞానం, ఆనందమే ఆ భగవంతుని మనస్సులో ఉంటాయి. కనుక, "మనసులోని అందం ముఖంలో తెలుస్తుంది" అని సామెతను అనుసరించి, భగవంతుని ముఖమండలం చాలా ప్రసన్నంగా ఉంటుంది– అని ఈ పదం తెలియజేస్తున్నది. రజోగుణాన్ని కలిగిన దేవతకు కలతతో కూడిన ముఖం, తమోగుణంలో కూడిన దేవతకు నిద్రముఖం ఉంటాయి– అనే విషయం దీనివల్ల చెప్పకుండానే తెలుస్తుంది.

**(శశివర్ణమ్)** నీలవర్ణం కలిగినవానికి చంద్రునివలె తెల్లని వర్ణం ఏ విధంగా ఉంటుంది? అని అంటే, వినండి. భగవంతుని సహజమైన తిరుమేని వర్ణం నీలవర్ణం అనేది సత్యమే అయినా, కృతయగంలో తెల్లదనాన్ని, త్రేతాయుగంలో బంగారంవలె ఎర్రని వర్ణాన్ని, ద్వాపరయుగంలో పాచిరంగువంటి పచ్చని వర్ణాన్ని,కలియుగంలో నల్లకలువవంటి నల్లని వర్ణాన్ని భగవంతుడు కలిగి ఉంటాడు– అనే విషయాన్ని "పాలిన్ నీర్మై శంబొన్ నీర్మై" అనే తిరుచ్ఛందవిరుత్త పాశురంలో (44) వివరింపబడిన విషయాన్ని గమనించవచ్చు. అందులోనే, "శంగవణ్ణ మన్న మేని శార్ ఙ్గపాణి యల్లైయే" (67) అని తిరుచ్ఛంద విరుత్త ప్రబంధంలోనూ, ఆ విధంగానే, తిరు నెడుమ్ దాండక ప్రబంధంలో (3) " వళై యురువాయ్ తిగ𝓏్న్దాన్ పెరు వడివిల్ కడలముదమ్ కొండ కాలమ్" (వళై= శంఖం) అని ఉండే పలు ప్రమాణాలను గమనించినట్లయితే, భగవంతునకు తెల్లని వర్ణం లేదు– అని చెప్పడానికి నోరు తెరిచే అవకాశం ఉన్నదా? ఇంతేకాక,

ద్వాదశనామపంజరస్తోత్రంలో "గోవిందో దక్షిణే పార్శ్వే ధన్వీ చంద్రప్రభో మహాన్ " అని అంటూ కుడివైపు నాలుగు ధనుస్సులను నాలుగు చేతులలో ధరించి ఉండేవాడు, చంద్రుని తెల్లనివర్ణంవంటి వర్ణాన్ని కలిగినవాడు, గొప్పవాడైన గోవిందుడు నన్ను కాపాడాలి) అని కీర్తింపబడిన గోవిందమూర్తియైన విష్ణువునకు "శుక్లాంబరధరమ్ "అనే ఈ శ్లోకంలో చెప్పబడిన శశివర్ణమే నిర్దేశింపబడినదనే విషయం ఇక్కడ గమనించదగినది.

ఇక్కడ ఇంకా వినండి. హయగ్రీవునకు సంబంధించిన ధ్యానశ్లోకంలో "నిర్మలస్ఫటికాకృతిమ్" – ఏ దోషం లేని, స్ఫటికమణివంటి తెల్లని రంగును కలిగిన శరీరాన్ని కలవాడు– అని శ్రియఃపతి అయిన హయగ్రీవుని మేనివర్ణం తెల్లనిది –అని చెప్పబడడం గమనించాలి. ఇంకా, వేదాంతదేశికులు అనుగ్రహించిన హయగ్రీవస్తోత్రంలో "శుద్ధస్ఫటికమణి భూభృత్ ప్రతిభటం సుధాసధ్రీచీభిః ద్యుతిభిః అవదాత త్రిభువనమ్" (ఏ దోషం లేని, స్ఫటికమణులతో నిర్మింపబడిన పర్వతాన్ని పోలి ఉండేది, అమృతంవంటి తెల్లని కాంతులతో ముల్లోకాలను తెల్లగా చేసేది అయిన) హయగ్రీవుని మూర్తిని నిర్దేశించడం, "ముగ్ధేందునిష్యందవిలోభనీయాం మూర్తిమ్" (లేత చంద్రరేఖనుండి పుట్టే ద్రవంవలె చాలా ఆశపడదగిన తెల్లని రూపాన్ని కలవానిని) (13) అని హయగ్రీవుని తిరుమేనినిగూర్చి పలకడాన్ని, ఇంకా ఇటువంటి ప్రమాణాలను గమనించాలి. పీదాంబరధరుడైన భగవంతునకు శుక్లాంబరధరత్వం పొసగకుండా పోదు. ఆ స్వామి దగ్గర లేనిది వేరొకరి దగ్గర ఉండే అవకాశమే లేదు. "సర్వగంధః సర్వరసః" (చాందోగ్యమ్) అనే శ్రుతివాక్యం "సర్వవర్ణః, సర్వవర్ణాంబరః" అనే దానికి ఉపలక్షణం– అని గ్రహించడం చాలా యుక్తం.

ఇక, ఇతరసంప్రదాయాలకు చెందినవారు ఈ శ్లోకాన్ని వినాయకుని పరంగా చెబుతున్నారు. వారి మతంలో ప్రసన్న వదనం– అనేదే విశేష్యం. ప్రసన్నపదానికి మదం పట్టిన గజం అని అర్థం చెప్పి, "ప్రసన్నో మత్తవారణః" అనే ఒక నిఘంటువచనాన్ని కూడా దానికి ప్రమాణంగా వారు చెబుతున్నారు. ఈ నిఘంటువాక్యం ఎక్కడ వెతికినా దొరకడం లేదు– అని అంటున్నారు, మనవారు. "సర్వవిఘ్నోపశాంతయే" అని ఉన్నందున, విఘ్నాలను పోగొట్టేవాడు విఘ్నేశ్వరుడై

కదా ఉండాలి– అని అంటారు, ఇతరులు. ఒక్కొక్క గ్రంథంలోనూ ఆరంభంలో తమ తమ ఇష్టదేవతలను గూర్చిన మంగళ శ్లోకాలను రచించడంకూడా విఘ్నాలను పోగొట్టడం కోసమే కనుక, విఘ్నాలను పోగొట్టడం ఒక్క వినాయకునకు మాత్రం కార్యంగా చెప్పడం సరి కాదు –అని, సర్వాంతర్యామియై, అంతటా నిండి ఉండే లక్ష్మీనాథునకు ఒక్కనికే సర్వవిఘ్నాలను పోగొట్టే శక్తి ఉన్నది, మిగిలిన ఎవరికి లేదు– అని అన్నా, అడ్డు పెట్టగలిగినవారు ఎవరూ లేరు.

# శ్రీవేంకటేశ్వరుడు – భగవద్రామానుజులు

(న్యాయవేదాంతవిద్వాన్, శ్రీవైష్ణవసింహ, ఉ. వే. శ్రీమాన్ టి. ఏ కృష్ణమాచార్యస్వామివారి 【తిరుపతి】 ద్రావిడవ్యాసం ఆధారంగా)

భగవద్రామానుజులు జీవించి ఉన్న కాలంలో కొందరు కాళహస్తిలోని శైవులు వేంకటాచల ప్రాంతాన్ని పాలించే యాదవరాజు దగ్గరకు వచ్చి, తిరుమల శైవక్షేత్రమని, శ్రీవేంకటేశ్వరుడు విష్ణువు కాదని కొన్ని కుయుక్తులను పలికి, వాదించి, తిరుమలను తమ స్వాధీనం చేయాలి– అని నిర్బంధించారు. అప్పుడు తిరుమలలో నివాసం ఉండే కొందరు సాధుశ్రీవైష్ణవులు శైవులను జయించటానికి శ్రీరంగంనుండి భగవద్రామానుజులను ఆహ్వానించారు. తరువాత, వారి ఆహ్వానంపై శ్రీరామానుజులు తిరుమలకు వచ్చి, యాదవ రాజు ఏర్పాటు చేసిన సభలో శైవులతో వాదించి గెలిచి, తిరుమలను విష్ణుక్షేత్రంగా, వేంకటేశ్వరుని శ్రియఃపతిగా స్థాపించారు– అని గురుపరంపరా ప్రభావం మొదలైన గ్రంథాల వల్ల తెలుస్తున్నది. ఈ విషయాలను వివరంగా తెలుసుకోవడానికి శ్రీ అనందాళ్వాన్ అనుగ్రహించిన శ్రీ వేంకటాచలేతిహాసమాల అనే సంస్కృత గ్రంథం చాలా ఉపయోగపడుతుంది. దానిని మూలంగా గ్రహించి, "శ్రీవేంకటేశ్వరుడు– భగవద్రామానుజులు" అనే శీర్షికను పురస్కరించుకొని వేలాది సంఖ్యలో పుటలను రాయవచ్చు. ఇప్పుడు, భగవద్రామానుజులు తిరుమలను విష్ణుక్షేత్రమని స్థాపించడం కోసం గ్రహించిన శ్రుతిస్మృతీతిహాసపురాణ పాంచరాత్ర శిష్టాచార రూపాలైన లెక్కలేనన్ని ప్రమాణాలలో, ఏదో ఒక ఋగ్వేద వాక్యాన్ని ప్రమాణంగా భగవద్రామానుజులు గ్రహించి, ఉపన్యసించి, స్థాపించడం మాత్రం వేంకటాచలేతిహాసమాలలో తెలుపబడింది. వేదమనేది భగవంతునివలె ఆది, అంతం లేనిది. ఒక పురుషునిచే నిర్మింపబడిన గ్రంథాలలో అయితే, ఆ పురుషులకు భ్రాంతి, అజ్ఞానం మొదలైన దోషాల ఉండడంవల్ల, వారి గ్రంథాలు సహజంగా ప్రమాణాలుగా కాకుండా పోవచ్చు. అటువంటి దోషాలకు సంభావన ఉండే విధంగా ఒక పురుషునిచే నిర్మింపబడకుండా, అపౌరుషేయంగా, నిత్యంగా ఉండే వేదం ప్రమాణాలలో చాలా గొప్పది–అని పెద్దలు అంటారు. ఆ వేదంలో

కూడా, ఏ విధంగా అర్థం గ్రహించాలి? అని సందేహం ఏర్పడితే, స్మృతీతిహాసపురాణాలతో వేదంలోని అర్థాన్ని సందేహం లేకుండా నిశ్చయించుకోవాలి– అని వారే అంటారు. "వేదార్థమ్ అరుది ఇడువదు స్మృతీతిహాసపురాణంగళాలే" అని శ్రీవచనభూషణలో మొట్టమొదటగా శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించడాన్ని

గమనించవచ్చు అందుచేత ఒక శ్రుతివాక్యం, దానికి వివరణ అయిన ఒక పురాణశ్లోకం –అనే వీటిని పురస్కరించుకొని, తిరుమల విష్ణుక్షేత్రమని శ్రీరామానుజులు నిశ్చయించిన విషయాన్ని ఇక ఇక్కడ గమనిద్దాం.

ఋగ్వేదంలో ఎనిమిదవ అష్టకం ఎనిమిదవ అధ్యాయం 13వ సర్గలో–

"అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే,
శిరింబిరస్య సత్వభిః తేభిష్ట్వా చాతయామసి"

అనేది మొదటి మంత్రం. ఇది వేంకటాచలం విష్ణుక్షేత్రం అనే విషయాన్ని సుస్థాపించే ప్రబలమైన ప్రమాణం. ఇందులో సందేహం ఏర్పడితే, భవిష్యోత్తరపురాణం వేంకటాచల మాహాత్మ్యాన్ని తెలిపే భాగంలోని నాలుగవ అధ్యాయంలో ఉండే

"అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః,
ఏవం వేదమయః సాక్షాత్ కీర్తితః పన్నగాచలః"

అనే ఉపబృంహణ శ్లోకాన్ని పురస్కరించుకొని, ఆ సందేహాన్ని తీర్చుకోవచ్చు– అని అంటున్నారు, భగవద్రామానుజులు.

మొదట పురాణ శ్లోకంలోని అర్థాన్ని గమనిద్దాం. ఈ భవిష్యోత్తర పురాణంలో ఉండే వేంకటాచల మాహాత్మ్య భాగం తిరుమల విష్ణుక్షేత్రం అనే విషయాన్ని చాలా స్పష్టంగా తెలియజేస్తున్నది– అనే విషయాన్ని ముఖ్యంగా ఇక్కడ గమనించాలి. ఆ పురాణంలో ఉండే ఈ శ్లోకం, ఋగ్వేదంలో ఉన్నదని ముందు ప్రస్తావించబడిన మంత్రాన్ని "అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ" అని ముందుగా ప్రస్తావించి చూపి, ఈ మంత్రం శ్రీ వేంకటాచలానికి

సంబంధించినది– అని తెలియజేసింది. "అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ" అనే ప్రారంభమయే వేదమంత్రంతో శ్రీవేంకటాచలాన్ని పెద్దలు తెలిసికొంటున్నారు. ఈ మంత్రం వేంకటాచలాన్ని సూచిస్తున్నదని పెద్దలు భావిస్తున్నారు. ఆదిశేషపర్వతమైన, ఈ ఉత్తమమైన పర్వతం వేదంచేత తెలియబడడం వల్ల ఇది వేదమయం అనబడుతున్నది – అనేది ఈ శ్లోకంలోని అర్థం. "వేదమయః" అంటే– వేదంచేత తెలియబడేది– అని అర్థం. ఛాందోగ్యోపనిషత్తులో "మనోమయః" (3–14) అనే పదానికి "మనస్సుతో తెలియబడేది"– అని, తిరువాయ్ మొழி ప్రబంధంలో "వేదమయన్" అనే ప్రయోగానికి "వేదంచేత అధ్యయనం చేయబడి, తెలియబడేవాడు"– అని వ్యాఖ్యాతలు వివరించి, అర్థాన్ని అనుగ్రహించడాన్ని గమనించవచ్చు.

ఈ విధంగా ముందు చూపించిన ఋగ్వేదమంత్రం దేనిని సూచిస్తున్నది? అనే సందేహం కలిగితే, "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (భారతం–1–273) ఇతిహాసం, లేక, పురాణం అనే వీటిని పురస్కరించుకొని వేదాన్ని వివరించాలి– అనే విధంగా ముందు పలికిన పురాణశ్లోకంతో ఆ వేదమంత్రం వేంకటాచలాన్ని తెలియజేస్తున్నది– అనే విషయం ఇక నిశ్చయింపబడుతున్నది.

ఇకపై మంత్రంలో ఉండే అర్థాన్ని భగవద్రామానుజులు భోగ్యంగా వివరించిన రీతిని చూద్దాం.

వేదపురుషుడు ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే పురుషార్థాలను పొందగోరే జీవాత్మను పిలిచి, వాటిని పొందడానికి తగిన ఉపాయాన్ని అతనికి ఉపదేశిస్తున్నాడు. ఈ మంత్రంలో "త్వయి" అనే ఒక పదాన్ని అధ్యాహరించుకోవాలి.

1)(నాయనా !జీవాత్మా!) (త్వయి అరాయి సతి)– నీవు ఈ లోకంలోని సంపదను, స్వర్గాదులైన పై లోకాలలో ఉండే సంపదలను లేనివాడవై ఉన్నట్లయితే,

(త్వయి కాణే సతి) నీవు బాహ్యనేత్రాన్ని గాని, లేక, ఆంతరనేత్రమైన జ్ఞానాన్ని కానీ లేనివాడివై ఉంటే,

(త్వయి వికటే సతి) నీవు ఆధ్యాత్మికం (శరీరంలో కలిగే జ్వరం మొదలైన తాపాలు), ఆధిభౌతికం (మానవులు, జంతువులు మొదలైనవాటి వల్ల కలిగే తాపాలు), ఆధిదైవికం (పిడుగులు మెరుపులు మొదలైనవాటి వల్ల, దేవతల వల్ల కలిగే తాపాలు) అనే మూడు విధాలైన తాపాలను పొందినవాడివై ఉంటే,

(త్వయి సదాన్వే సతి) నీవు ముందు తెలిపిన పురుషార్థాలను పొందనీయకుండా అడ్డుపడే అసురులు మొదలైన శత్రువులను కలవాడివై ఉంటే,

(శిరింబిఠస్య) లక్ష్మీదేవికి వక్షస్సులో స్థానాన్ని ఇవ్వడం ద్వారా ఆమెకు పీఠమైన శ్రీనివాసుని,

(గిరిమ్) పర్వతాన్ని ఉద్దేశించి

(శిరింబిఠస్య సత్వభిః) శ్రీనివాసుని భక్తులతో కలసి,

(గచ్ఛ) ముందు తెలిపిన ఆపదలు అన్నిటిని పోగొట్టుకోవడం కోసం వెళ్ళు.

(తేభిః) వారి మూలంగా,

(త్వా) నీవు,

(చాతయామసి) శ్రీనివాసుని ప్రార్థించటానికి తగిన యోగ్యతను పొందినవాడవు అవుతున్నావు. అందుచేత, పూర్వం చెప్పిన సంపద లేకపోవడం మొదలైన తాపాలు ఏర్పడినప్పుడు శ్రీనివాసుని తిరుమలనుగూర్చి అతని భక్తులతో కలిసి వెళ్లి, వారిని ముందు ఉంచుకొని, ఆ స్వామి దగ్గర నీకు ఆవశ్యకమైన ఫలాన్ని యాచించదగినవాడివై ఉన్నావు– అని వేదపురుషుని ఉపదేశం.

2) లేక, ఈ విధంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు. "ధాతూనామ్ అనేకార్థత్వాత్" –ధాతువులకు అర్థాలు అనేక విధాలుగా ఉంటాయి– అనే న్యాయాన్ని అనుసరించి,

"చాతయామసి"అనే పదానికి "సమర్పించడానికి తగిన యోగ్యతను పొందుతున్నావు "అని అర్థం చెప్పడం కూడా యుక్తమే. " శిరింబిఠస్య త్వా తేభిః చాతయామసి"అని అన్వయించి, " శ్రీనివాసనకు నిన్ను ఆ భక్తుల ద్వారా సమర్పించడానికి తగిన యోగ్యతను పొందుతున్నావు" అని ఇక్కడ పదాలకు అర్థాన్ని గ్రహించాలి. ఈ విధంగా పూర్వం చెప్పిన దుఃఖాలు కలిగినప్పుడు, శ్రీనివాసుని వేంకటాచలాన్ని ఉద్దేశించి, అతని భక్తులతో కలిసి వెళ్లి, వారిని ముందు ఉంచుకొని, నిన్ను ఆ స్వామికి సమర్పించదగినవాడవై ఉన్నావు— అని వేదపురుషుడు ఉపదేశిస్తున్నాడు— అని ఇక్కడ అర్థాన్ని గ్రహించాలి. శ్రీనివాసుని ప్రార్థిస్తే, లేక, శ్రీనివాసునకు నిన్ను అర్పణం చేస్తే, నీకు కలిగిన దుఃఖాలు తీరి, ధర్మం మొదలైన నాలుగు విధాలైన పురుషార్థాలు నీకు లభిస్తాయి— అని ఇక్కడ సారమైన అర్థం.

వేదమంత్రంలో ఉండే పదాలలోని కొన్ని విశేషార్థాలు

"అరాయి" – °రై" అంటే సంపద, "వికటే"– కటం అంటే –దాహం, తాపం –అని అర్థం. "సదాన్వే"– వేదంలో "దారవమ్" అనేది "దార్వం" అని మారినట్లుగానే, "దానవ" అనే పదం "దాన్వ" అని మారింది. " శిరింబిఠస్య" – "తర్యంబకః" అనేది "త్రియంబకః" అని, " సువః" అనేది "స్వః " అని మారేటట్లే, మహాలక్ష్మియొక్క బీజాక్షరమైన "శ్రీమ్" అనేది "శిరిమ్" అని మారింది. "పీఠః "అనేది "బిఠః" అని మారింది. లేక, విశేషంగా ఉండే చోటు— అనే అర్థాన్ని ఇచ్చే "విఠః" అనేది "బిఠః" అని మారినట్లుగా కూడా గ్రహించవచ్చు. "విభ్రాజమానః" అనేది "బిభ్రాజమానః" అని మారిందని భావించినట్లే, దీనిని కూడా భావించాలి. "సత్త్వః" –భగవంతుని ఆశ్రయించి, సత్తను పొందినవాడు— అనేది అర్థం కనుక, భక్తుడు అనేది ఆ పదం ద్వారా స్పష్టమైన అర్థం.

ఇంతకుముందు వేదమంత్రానికి చెప్పిన మొదటి అర్థంలో "శిరింబిఠస్య "– "శ్రీనివాసుని, పర్వతాన్ని ఉద్దేశించి" అనే రెండు పదాలతో అన్వయించేటప్పుడు, ఈ పదం యథాతథంగానే అన్వయిస్తుంది. "చాతయామసి" అనే పదంతో

అన్వయించేటప్పుడు మాత్రం, అర్థానికి తగినట్లు "శిరింబిఠమ్" శ్రీనివాసుని– అని ద్వితీయావిభక్తి అర్థంలో ఈ పదం అన్వయిస్తున్నది.

ఇక, రెండవ అర్థంలో అయితే, " చాతయామసి" – (సమర్పించడానికి తగిన యోగ్యతను పొంది ఉన్నావు) అనే పదం అన్వయించేటప్పుడు, "శ్రీనివాసునకు" అనే అర్థాన్ని ఇచ్చే షష్ఠీ విభక్తిరూపంగానే అన్వయిస్తుంది. "సత్త్వైః" అనేది "సత్త్వభిః" అని, " త్వైః" అనేది " తేభిః" అని మారినవి.

మొదటి అర్థంలో ద్వితీయావిభక్తిపదమైన "త్వా" అనేది "నీవు" అనే ప్రథమావిభక్తి రూపంగా మారింది. దీనికి "సహస్రశీర్షం దేవమ్" వైదిక ప్రయోగంలోని ద్వితీయా విభక్తి రూపాలు రెండు ప్రథమావిభక్తిలోని అర్థాన్ని ఇచ్చేటట్టుగా మారడాన్ని ఉదాహరణగా గమనించవచ్చు. ద్వితీయా విభక్తి అర్థంలో" నిన్ను" అనే చెప్పవలసి ఉన్నందున, "త్వా" అనేది ఉన్నది ఉన్నట్లుగానే అన్వయిస్తున్నది. ఇవి అన్నీ చాందసమైన, అంటే, వేదంలో పదాల రూపాలలో కలిగే, వికారాలు, అంటే, మార్పులు కనుక, ఇవి సహజమైనవే కదా.

ఈ మంత్రంలో ఉండే పదాల సన్నివేశాన్ని చూస్తే, శ్రీనివాసుని పర్వతాన్ని, శ్రీనివాసుని, అతని భక్తులను ముందుంచుకొని ఆశ్రయించవలసిన స్థితి స్పష్టమవుతున్నందున, ఈ వేంకటాచలం విష్ణుక్షేత్రం– అనేది, అక్కడ వేంచేసి ఉండే దైవం శ్రీపీఠుడైన, అంటే, అలర్ మేల్ మంగై వక్షఃస్థలంలో నివసించే విష్ణుభగవానుడే– అనేది స్పష్టపడుతున్నది.

ఈ విధంగా శ్రీరామానుజులు ప్రమాణాలలో శ్రేష్ఠమైన వేదమంత్రాన్ని, దానికి వివరణరూపమైన పురాణశ్లోకాన్ని ఉదాహరించి, శైవులను జయించి, యాదవరాజును నమ్మేటట్లు చేసి, అతనిని తనకు శిష్యునిగా చేసికొని శ్రీవేంకటాచలాన్ని, శ్రీనివాసుని రక్షించిన కారణంచేతనే ఈ దివ్యదేశం లోకానికి తిలకంగా ప్రకాశిస్తున్నది.

# శ్రీరామానుజనామవైభవం

శ్రీరామానుజనామవైభవాన్ని గురించి పెద్దలు ఒక విశేషాన్ని తెలియజేశారు. లోకంలో అనుజుడు అంటే– వయసులో చిన్నవాడు, అనుసరించి తరువాత పుట్టినవాడు– అని అర్థం. ఇది సామాన్యమైన అర్థం. శేషమైన అర్థం ఏమంటే– ఒక మహనీయవ్యక్తి ఒక విలక్షణమైన, విశిష్టమైన లక్ష్యంతో, సంకల్పంతో, ఒక విశిష్ట కార్యంకోసం అవతరించినప్పుడు, ఆ విధంగా అవతరించిన ఆ వ్యక్తి సంకల్పం, లక్ష్యం, కార్యం నెరవేరడానికి అతనిని అనుసరించి ఎవరు అవతరిస్తారో, అతనికి అనుజుడని పేరు. అందువల్ల రామానుజశబ్దానికి రాముని అనుజుడు, రాముని తరువాత పుట్టినవాడు, సోదరుడు– అని మాత్రమే అర్థం కాదు. రామావతార సంకల్పం ఏది ఉన్నదో, రామావతార లక్ష్యం ఏది ఉన్నదో, రామావతారకార్యం ఏది ఉన్నదో, వాటిని అనుసరించి, వృద్ధిచేసి, ప్రపూర్తిని చేయడం కోసం ఎవరు జన్మించారో, వారు రామానుజులు అనేది ఇక్కడ విశేషమైన అర్థం. ఇక్కడ అనుసరించడం అనే దానిలో – అనువర్తనం, అభివర్ధనం, ప్రపూరణం అనే మూడు అంశాలు ఉన్నాయి. ఈ మూడిటిని నిర్వహించడం కోసం అవతరించినవారే రామానుజులు. అందుచేత, శ్రీ రామావతారంలో రామచంద్రమూర్తి సంకల్పం ఏది ఉన్నదో, లక్ష్యం ఏది ఉన్నదో, కార్యం ఏది ఉన్నదో, వాటిని అనవర్తించడం, అభివర్ధనం చేయడం, ప్రపూరణం చేయడం– అనేవి శ్రీరామానుజావతారంలోని ముఖ్యోద్దేశ్యాలు– అని ఈ సమన్వయంలోని తాత్పర్యం. శ్రీరాముడు లోక క్షేమం కోసం ఏ ఏ కార్యాలను చేశాడో, వాటిని అనుసరించి చేయడం అనువర్తనం, వాటిని మరింత వృద్ధి చేయడం అభివర్ధనం, అతడు ఏ ఏ కార్యాలను కొంత చేసి వదిలి పెట్టాడో, వాటిని పూర్తి చేయడం ప్రపూరణం.

శ్రీరామావతారంలోని గురుపరంపరను చూస్తే, విశ్వామిత్ర వశిష్ఠాదిరూపంలో ఆ గురుపరంపర సామాన్యంగా ఉన్నది. పరమైకాంతుల రూపంలో లేదు. ఈ గురుపరంపరలో పరమైకాంతుల సంబంధం ఏమాత్రం లేదు. కానీ,

శ్రీరామానుజావతారంలో " మాఱన్ అడి పణిందు ఉయ్ న్దవన్" (నమ్మాళ్వారుల శ్రీచరణాలను ఆశ్రయించి, ఉజ్జీవించినవారు) అనే విధంగా పరమైకాంతి అయిన నమ్మాళ్వారుల సంబంధం వారికి లభించింది. పరమైకాంతులైన మహాపూర్ణాది ఐదుగురు ఆచార్యుల సంబంధం లభించింది.

శ్రీరామావతారంలో రామానుజుడు అయిన లక్ష్మణుడు తన భార్యను వదిలిపెట్టి, శ్రీరామునితో అరణ్యాలకు వచ్చి, శ్రీరామునకు ఎన్నో కైంకర్యాలను చేశాడు. భగవద్రామానుజులుకూడా తమ భార్యను వదిలిపెట్టి, సన్న్యసించి భగవంతుని కైంకర్యాలను ఎన్నో విధాలుగానో చేశారుకదా. శ్రీరామావతారసమయంలోని రామానుజుడైన లక్ష్మణునకు "సాంసారికమైన సంబంధానికి దూరమై పూర్తిగా భగవంతుడు సేవ చేయలేకపోయామే! అనే ఒక తాపం హృదయంలో ఉండేదట. ఆ తాపం, భగవద్రామానుజావతారంలో సన్న్యాసాన్ని స్వీకరించి, భగవత్కైంకర్యాలను చేసిన తరువాత శ్రీరామానుజులకు తీరింది.

శ్రీరామావతారంలో శ్రీరాముడు "అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే ", " కిం కార్యం సీతయా మమ" అని తనను ఆశ్రయించిన భక్తుల రక్షణ కోసం పత్నీత్యాగానికి కూడా సిద్ధమని మాట మాత్రమే అన్నాడు. కానీ, ఆ పని చేయలేదు. భగవద్రామానుజావతారంలో పెరియనంబి అనబడే మహాపూర్ణుల విషయంలో, కాంచిపూర్ణులు అనే తిరుక్కచ్చినంబి విషయంలో పత్నీమూలకంగా జరిగిన అపచారాల కారణంగా తమ పత్నిని విడచి సన్న్యసించి, భగవంతుని భక్తులైనవారి కైంకర్యాలను శ్రీరామానుజులు చేశారు. ఆ విధంగా రామావతారంలో సాధురక్షణ కోసం, ఆవశ్యకమైతే, పత్నీ త్యాగాన్నికూడా చేస్తానని శ్రీరాముడు చెప్పిన మాటను శ్రీరామానుజులు ఈ యుగంలో పూర్తిచేశారు. శ్రీరామావతారంలో కలిగిన సన్యాసభావాన్ని శ్రీ రామానుజులు శ్రీరామానుజులు ఈ యుగంలో ఆచరించి, అనువర్తించారు.

శ్రీరామావతారంలో ఆచార్యులు కేవలం వైదికులు మాత్రమే, పరమర్షులు కాదు. కానీ, రామానుజావతారంలో వారి ఆచార్యులు పరమర్షులు అయిన ఆళ్వారులు. వీరు పరమైకాంతులయిన ఋషులు కనుక పరమర్షులు. ఇది అభివర్ధనం.

శ్రీరాముడు తన కులదైవం అయిన శ్రీరంగనాథుని సేవించినా, క్షత్రియ ధర్మ పూర్వకంగానే సేవించాడు. " సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" అనే విధంగా కులధర్మానుసారంగా పత్నీసహితుడై శ్రీరంగనాథుని అర్చించాడు తప్ప, పరమైకాంతులు అర్చించే విధానంలో అర్చించలేదు. ఆ కొరక తీరేటట్లుగా, ఆ శ్రీరంగనాథుని శ్రీరామానుజులు శ్రీరంగంలో పరమైకాంతిధర్మంతో పాంచరాత్రాగమ ప్రకారం ఆరాధనాదులను జరిపించారు. ఇది ప్రపూరణం.

శ్రీరంగనాథుని మొదట బ్రహ్మ సేవించాడు. దేవతలు గర్విష్ఠులు. అందువల్ల బ్రహ్మ ఆరాధన వల్ల రంగనాథనకు తృప్తి కలుగలేదు. ఈ లోకంలో ఆ స్వామిని ఇక్ష్వాకువు మొదలైన మానవప్రభువులు ఆరాధన చేశారు. వీరు దేవతలంత గర్విష్ఠులు కాకపోయినా, సామాన్య ధర్మంతో అర్చించారు తప్ప పరమైకాంతి ధర్మంతో ఆరాధించలేదు కనుక, అప్పుడు కూడా శ్రీరంగనాథునకు పూర్తిగా తృప్తి కలుగలేదు. తరువాత, శ్రీరాముడు రంగనాథుని అర్చించినా, తృప్తి కలుగలేదు. తరువాత, దాసుడైన విభీషణుడు ఆరాధించాడు. విభీషణుడు ప్రపన్నుడే అయినా, అతడు ఏదో ఒక కార్యం కోసం ప్రపత్తిని చేసినవాడుకదా. "రాజ్యకాంక్షీ విభీషణః" కదా. అందువల్ల అతడు పరమైకాంతి కాదు. తరువాత, పరమైకాంతులైన ఆళ్వారులు రంగనాథుని కీర్తించారు., వారు చూపిన పరమైకాంతి ధర్మంతో శ్రీరామానుజులు శ్రీరంగనాథునకు పాంచరాత్రాగమ విధానంలో ఆరాధనలను నిర్వర్తింపజేసినప్పుడు, శ్రీరంగనాథునకు పరిపూర్ణమైన తృప్తి కలిగింది. ఇది ప్రపూరణం. ఈ విధంగా శ్రీరాముడు చేసిన కార్యాలలో అనువర్తించి, అభివృద్ధి పొందించి, ప్రపూర్తిని పొందించారు కనుక, శ్రీరామానుజులు శ్రీరాముని అనుజులు అయ్యారు. ఇది పెద్దలు తెలియజేసిన, విలక్షణమైన రామానుజనామవివరణం.

# శ్రీరామచరమశ్లోకంలో శరణాగతిగద్య

శ్రీవైష్ణవసంప్రదాయంలోనే కాక, జగత్తు అంతా కూడా ప్రసిద్ధమైన శ్లోకం "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ "అనే శ్లోకం. ఇది శ్రీవైష్ణవ సంప్రదాయంలో శ్రీరామ చరమశ్లోకంగా ప్రసిద్ధి చెందింది. చరమ శ్లోకం అంటే– ఉత్తమమైన శ్లోకం– అని, తన చరమమైన నిర్ణయాన్ని ప్రకటించే శ్లోకం– అని అర్థం. విభీషణశరణాగతి సందర్భంగా శ్రీరాముడు ఈశ్లోకం ద్వారా తన చివరి నిర్ణయాన్ని వ్యక్తం చేశాడు కదా. అందువల్ల దీనికి శ్రీరామ చరమశ్లోకం అని పేరు వచ్చినదని పెద్దలు అంటారు. సుగ్రీవుడు మొదలైనవారు విభీషణుని స్వీకరించరాదని, హనుమంతుడు మొదలైనవారు అతనిని చేర్చుకొనవచ్చునని, ఈ విధంగా పలువురు వేరు వేరు అభిప్రాయాలను వ్యక్తం చేసినప్పుడు, శ్రీరాముడు చివరిగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ, విభీషణునిలో దోషం ఉండడం తనకు సమ్మతమేనని, అది అతనిని స్వీకరించటానికి ఏమాత్రం అడ్డు రాదని తెలియజేసే సందర్భంలో అతడు పలికిన సూక్తి ఇది. "ఒక్కసారి శరణాగతి చేసి, "నేను నీకు చెందినవాడను"– అని యాచించివానికి అన్ని ప్రాణులనుండి నేను అభయాన్ని కలిగిస్తాను, ఇది నా వ్రతం" అనేది ఈ శ్లోకంలోని తాత్పర్యం. ఇక్కడ "సర్వభూతేభ్యః" అనే ప్రయోగాన్ని పంచమీ విభక్త్యంత రూపంగా గ్రహించి, అర్థాన్ని గ్రహించాలి.

ఈ శ్లోకంలో, పంగుని మాసం ఉత్తరానక్షత్రంనాడు శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తి అయిన నంబెరుమాళ్ శ్రీరంగనాయకితో కలసి వేంచేసి ఉండే సందర్భంలో భగవద్రామానుజులు మన అందరి ఉజ్జీవనం కోసం ఆ దివ్యదంపతుల సన్నిధిలో చేసిన శరణాగతి సూచింపబడింది– అనే ఒక చమత్కారమైన అర్థాన్ని పెద్దలు తెలియజేశారు.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే = ఒక్కసారి శరణాగతి చేసినవానికోసం, "నేను నీవాడనై ఉన్నాను" అని యాచించినవాని కోసం, అభయం సర్వభూతేభ్యః దదామి = ప్రాణులందరికీ నేను అభయాన్ని ఇస్తాను, ఏతత్ వ్రతం మమ = ఇది నా వ్రతం——అనేది ఇక్కడ అర్థం. ఈ అర్థంలో "సర్వభూతేభ్యః" అనేటపుడు చతుర్థీవిభక్తిలో అర్థాన్ని చెప్పుకోవాలి.

ఈ అర్థంలో "మీరు చేసిన శరణాగతి కారణంగా మీకే కాకుండా,మీ సంబంధి సంబంధులకు కూడా నేను అభయాన్ని ఇస్తాను, ఇది నా వ్రతం"— అని భవిష్యత్తులో శ్రీరంగనాథుడు శ్రీరామానుజులకు మాట ఇవ్వబోతాడు— అనే విషయం సూచింపబడినది కదా.

ఇందువల్ల, ఇక్కడ, శ్రీరామచంద్రుడు కలియుగంలో సంభవించబోయే శ్రీరామానుజుల అవతారాన్ని, వారు శరణాగతి చేయబోయే సందర్భాన్ని తన సూక్తి ద్వారా సూచించాడని చెప్పే అవకాశం ఉన్నదికదా. శ్రీరంగంలోని ఉత్సవమూర్తి అయిన నంబెరుమాళ్ శ్రీరామునకు ప్రతిరూపంగా సంప్రదాయంలో భావింపబడడం కూడా ఇక్కడ ఈ అర్థాన్ని గ్రహించడానికి అనుగుణంగా ఉన్నది.

# భగవంతుడు ఒక వ్యాపారి

భగవంతుడు ఒక విలక్షణుడైన వ్యాపారి అని వేదాంత శాస్త్రాలు పేర్కొంటున్నాయి. లోకంలో వ్యాపారం అనేది స్వకార్యం కోసం, స్వోన్నతి కోసం, స్వలాభం కోసం చేసే పని.లోకంలోని వ్యాపారి తన ఉన్నతి కోసం, తన లాభం కోసం చేస్తాడు. కానీ, భగవంతుడు అనే వ్యాపారి మాత్రం స్వకార్యంగా స్వోన్నతి కోసం, స్వలాభం కోసం తాను చేసే వ్యాపారాన్ని చేయడు. పరోన్నతి కోసం, జగత్తు క్షేమం కోసం, సర్వజన కళ్యాణార్థం చేసే ఒక పవిత్రమైన వ్యాపారం ఇది. ఈ వ్యాపారం ఆశ్రితవ్యాపారమని, జగద్వ్యాపారమని రెండు విధాలుగా ఉంటుంది. భగవంతుని జగద్వ్యాపారం అనేది సృష్టి స్థితి సంహారాత్మకమైనది. ఈ విషయం అందరికీ తెలిసినదే. భగవంతుని భాగంలో వ్యక్తమని, అవ్యక్తమని రెండు ప్రకారాలు ఉన్నాయి. వీటిలో వ్యక్త భాగాన్ని మాత్రం తెలిసినవారికి వైదికులు అని పేరు. అవ్యక్తభాగాన్ని తెలిసినవారు వైష్ణవులు అనబడతారు. సామాన్య ధర్మమాత్రాన్ని తెలిసిన స్మృతిమాత్రప్రధానులు స్మార్తులు. వీరికి సామాన్యధర్మాలు మాత్రమే తెలుసు విశిష్టధర్మాలను తెలిసినవారు వైష్ణవులు. ధర్మాలలో రసమర్మాలను తెలిసిన, తాంత్రికమైన రహస్యాలను తెలిసినవారికి వైష్ణవులని పేరు.

భగవంతుడు చేసే ఈ రెండు విధాలయిన వ్యాపారాలలో అశ్రితవ్యాపారమే ఆ స్వామికి మిక్కిలి ఉద్దేశ్యమైనది. దానికోసంగా జగద్వ్యాపారాన్ని చేస్తున్నాడు. అంతే తప్ప, జగద్వ్యాపారానికి అంగంగా ఆశ్రితవ్యాపారాన్ని చేయడు. లోకంలో స్వర్ణాన్వేషణ న్యాయమని ఒక న్యాయం ఉన్నది. అంటే, బంగారాన్ని అన్వేషించడం కోసం చాలా ఎక్కువ పెద్ద పరిమితిలో బంగారంతో కూడిన మట్టిని సేకరించి, దానినుండి బంగారం తీయడంకోసం శోధించి అన్వేషిస్తారు. ఈ విషయాన్ని బంగారపు గనులలో ప్రత్యక్షంగా మనం చూస్తున్నాము. చాలా విలువైన, అమూల్యమైన, స్వల్ప పరిమితిలో ఉండే బంగారంకోసం ఎక్కువ పరిమితిలో ఉండే మట్టిని సేకరించి, అందులో బంగారాన్ని అన్వేషిస్తారు కదా. చాలా స్వల్పమైన బంగారాన్ని సంపాదించడం కోసం ఎంతో

పరిశ్రమను చేస్తారు. ఆ విధంగానే, భగవంతుడు కూడా "స మహాత్మా సుదుర్లభః" అనే విధంగా ఆస్తికుడైన, భక్తుడైన,, పరమైకాంతి అయిన, చరమ పర్వనిష్ఠుడైన మహాత్ముని పొందడం కోసమే లక్షోపలక్షలుగా ఉండే ఈ జీవరాశిని సృష్టి చేసి, జగద్వ్యాపారాన్ని సాగిస్తున్నాడు. ఆశ్రితవ్యాపారమే అతని ప్రధాన లక్ష్యం. జగద్వ్యాపారం అనేది దానికి కోసం చేస్తున్న పూర్వాంగం, ఉపాంగంవంటిది. సాధనంవంటిది. అది భగవంతునకు ప్రధాన లక్ష్యం కాదు. ఆశ్రిత వ్యాపారమే భగవంతునకు ప్రధాన వ్యాపారం అని పెద్దలు చెబుతున్నారు.

భగవంతుడు ఈ ఆశ్రితవ్యాపారాన్ని ఉద్ధారణం, అవతరణం అని రెండు రీతులుగా నిర్వహిస్తున్నాడు. అల్పజ్ఞులైన, అల్ప శక్తులైనవారికి జ్ఞానశక్తి సత్సంగాదులను ప్రసాదించి, వారు క్రమక్రమంగా సోపానాలను ఎక్కి, తన దగ్గరకు చేరేటట్లు చేయడం ఉద్ధారణం. ఆ భగవంతుడే స్వయంగా ఇక్కడకు ఈ లోకానికి దిగి వచ్చి, "మగ్నాన్ ఉద్ధరతే లోకాన్" అనే విధంగా తన భక్తులను అనుగ్రహించడానికి అవతరణం అని పేరు.

ఈ విధంగా భగవంతుడు ఎవరెవరిని స్వయంగా పైకి రమ్మని అంటాడు? ఎవరెవరి కోసం తానే కిందికి దిగి వస్తాడు? అని అంటే, "నాకు తెలుసు, నేను స్వయంగా ఉపాయాన్ని అనుష్ఠించగలను" అనే భావించి ప్రయత్నించే ఉపాసకులు, భక్తినిష్ఠులు,మొదలైనవారిని స్వప్రయత్నంతో తన దగ్గరకు రమ్మని అంటాడు. అత్యంత భక్తినిష్ఠులైన పరమైకాంతుల కోసం తానే దిగి కిందకు వస్తున్నాడు.

భగవంతుడు ఈ మూడు విధాలయిన వారికోసం అవతరిస్తున్నాడు. వారెవరంటే– చాలా గొప్పవారికోసం, అంటే, పరమైకాంతులైన ప్రపన్నులయిన మహాత్ములకోసం వారితో సంబంధం పొందినవారి కోసం, చాలా శక్తి లేనివారికోసం– ఈ విధంగా మూడు విధాలయినవారికోసం భగవంతుడు అవతరిస్తాడు.

ఈ భగవదవతారాలు కూడా. సాక్షాదవతారాలు, అంశావతారాలు, ఆవేశావతారాలు అని మూడు విధాలు. ఇవి కూడా పూర్వాంగాలే. దేనికి పూర్వాంగాలు? అంటే, ఆచార్యావతారానికి ఇవి పూర్వాంగాలు. ఏ కార్యానికైనా

పూర్వాంగక్రియలు కొన్ని ఉంటాయి కదా. ఆ విధంగా ఇక్కడ ఆచార్యావతారం అనే ప్రధాన కార్యానికి భగవదవతారాలు పూర్వాంగక్రియలవంటివి. ఆచార్యావతారానికి ముందు ఇవి వీథిశోధనంవంటివి. భగవంతుడు తిరువీథులలోనికి వేంచేసే ముందు ఆ వీథులలో నీటితో జల్లి శుభ్రం చేసి, తోరణాలు కట్టి, పువ్వులను జల్లి, ముగ్గులు పెట్టి అలంకరిస్తారు కదా. అటువంటి వీథిశోధనను, ప్రసాధనను చేసే వీథిశోధకులవంటివి, ఈ భగవదవతారాలు. లోకంలో ఆస్తిక్యం కలిగి, వేద విశ్వాసం, వేదానుష్ఠానంలో రుచి పెరగడానికి, భక్తి మొదలైన గుణాలు అంకురించటానికి, తద్ద్వారా ఆచార్యావతారం సఫలం కావడానికి భగవంతుడు చేసే వ్యాపారాలే ఈ భగవదవతారాలు. భగవంతుని అవతారాలకు ప్రధాన ప్రయోజనం ఆచార్యావతార సాఫల్యం. ఆచార్యావతారాలు సఫలం అయినప్పుడే సర్వోన్నతి, సర్వసౌభాగ్యం, సర్వసద్గతి కలుగుతుంది. కనుక, ఆ ఆచార్యవతారసాఫల్యం కోసం ముందుగా భగవంతుడు చేసే పూర్వాంగక్రియారూపాలే భగవదవతారాలు.

భగవంతుని అవతారాలు– పూర్ణావతారాలు, అంశావతారాలు, ఆవేశావతారాలు– అని మూడు విధాలు కదా ఇవికూడా లక్ష్యం కోసం, కార్యం కోసం, ఆశ కోసం– అనే మూడు కారణాలవల్ల ఇవి సంభవిస్తాయి. భగవంతుడు ఈ లోకానికి స్వయంగా రావడం ఎందుకు?అతడు కేవలం సంకల్పంలోనే ఇటువంటి మహత్తరమైన కార్యాన్ని అయినా నిర్వహించగలడు కదా. సర్వజ్ఞుడు సర్వశక్తి అయిన ఆ భగవంతుడు ఇక్కడకు ఎందుకు వస్తున్నాడు? అంటే, గుహ శబరి విభీషణాది భక్తులను, దధిభాండాక్రూరవిదుర మాలాకారాది భక్తులను తన దివ్యమంగళరూపావిష్కరణలో, కటాక్ష సంలాపస్పర్శనాదులలో ఆనందపరచి, వారిని అనుగ్రహించడం కోసం అవతారాలనే వ్యాపారాన్ని చేస్తున్నాడు. అందువల్ల భగవంతుడు ఈ లోకంలో అవతరించడం పరమైకాంతులైన భక్తులను ఆనంద పరచాలనే ఆశవల్ల. ఆ విధంగానే, కొంతమందిలో ఆవేశించి, అవతరించడం –కొన్ని కొన్ని కార్యాలను నిర్వహించడం కోసం. ఆచార్యులను ఈ లోకంలో అవతరింపజేయడం తన లక్యసిద్ధి కోసం. ఈ విధంగా భగవంతుని అవతారాలవల్ల అతడు భగవంతుని తలచిన

కార్యం, ఆశయం, లక్ష్యం సిద్ధిస్తాయి. అయితే, భగవంతుని లక్ష్యసిద్ధి ఆచార్యావతారం ద్వారానే పూర్తి అవుతుంది. సఫలం అవుతుంది.

భక్తినిమగ్నులయిన ఆళ్వారులను భగవంతుడు ఈ లోకంలో జన్మింపచేస్తున్నాడు. భగవంతుడు స్వేతరసమస్త వస్తువిలక్షణుడు అయినట్లే, ఆళ్వారులుకూడా స్వేతరసమస్త జీవవిలక్షణులు. వారు నిత్యులా? ముక్తులా? భక్తులా? అంటే, ఈ మూడు వర్గాలలోను వారు చేరరు. అందువల్ల వారు స్వేతరసమస్త జీవ విలక్షణులు. ఈ విధంగా భగవంతుని అవతారాలలోని, స్వేతర సమస్త జీవవిలక్షణులైన ఆళ్వారుల అవతారాలలోని పలు విధాలైన లీలల రసాన్ని, లక్ష్యాన్ని, ప్రయోజనాన్ని లోకానికి తెలియజేసి, వారిని తరింప చేయడం కోసం పూర్వాచార్యులను అవతరింప చేయడం అనే వ్యాపారాన్ని భగవంతుడు చేస్తున్నాడు. ఈ ఆచార్యావతారమే కనుక లేకపోతే నిత్యముక్తనిమగ్న జ్ఞానిసదవతారాలు, భగవంతుని పూర్ణాంశావేశావతారాలు అనే అన్నీ వ్యర్థమైపోతున్నాయి, " సర్వే హుతం భస్మని" – బూడిదలో హోమం చేసినట్లు అవుతున్నాయి. ఈ విధంగా భగవంతుడు చేసే అనేక విధాలైన వ్యాపారాలను లోకానికి తెలియజేయడం కోసమే ఆచార్యావతారాలు ఏర్పడుతున్నాయి.



పెరియ పెరుమాళ్, శ్రీరంగం

# ఆత్మకు కల రెండు నేత్రాలు

కీర్తిమూర్తులు, ఉ. వే. శ్రీమాన్ తిరుమలై ఆనందాణ్ పిళ్ళై, శతాభిషేకం గోవింద నరసింహాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)

చతుర్ముఖ బ్రహ్మచే సృష్టి చేయబడిన అన్ని ప్రాణులకు లోకంలో ఉండే వస్తువులను చూడడానికి సహాయపడేవి రెండు నేత్రాలే.

బ్రహ్మకు కళ్ళు ఎనిమిది అని, రుద్రునకు మూడు కళ్ళు అని, ఇంద్రునకు వేయి కళ్ళు అని చెప్పబడుతున్నది కదా! అని అంటే, బ్రహ్మకు ఒక తలకు ఉండేవి రెండు కన్నులే. ఒక వస్తువును చూడడానికి అతనికి ఎనిమిది కన్నులు ఆవశ్యకం కాదు. మూడు నేత్రాలు కలిగిన రుద్రునకు కూడా వస్తువులను చూడడానికి రెండే కన్నులు ఉపయోగపడుతున్నాయి.అతని నుదుటి మధ్యలో ఉండే ఒక కన్ను లయకాలంలో అన్ని వస్తువులను దహించడానికే ఉపయోగపడుతుంది. రుద్రుని కోపానికి లక్ష్యమైనవారుకూడా అతని ఫాలనేత్రంచేతనే దహింపబడ్డారు. ఇంద్రునకుకూడా వస్తువులను చూడడానికి సహాయపడేవి రెండే కన్నులు. మిగిలినవి అతడు చేసిన తగని చర్యకు సాక్ష్యంగా ఏర్పడ్డాయి, అంతే.

ఈ విధంగా శరీరంతో అనుభవించే అల్పమైన సంతోషానికి ఉపయోగపడే వస్తువులను చూడడంకోసమే ఈ రెండు మాంసచక్షువులు ఉపయోగపడుతున్నాయి. శరీరం అనిత్యమైనది. అది నిలచి ఉండే సమయంలోకూడా వ్యాధి మొదలైనవాటిచేత అల్పసుఖాన్ని పొందడానికి శక్తిని పొందడం లేదు. ఇంతేకాక, శరీరంతో పొందబడే సుఖం దుఃఖంతో కలసి ఉంటుంది. చాలా పరిమితంగా ఉంటుంది. ఇతరులను తనతో కలుపుకోవడానికి అవకాశాన్ని ఇవ్వనిదై ఉంటుంది. కొన్ని కొన్ని సమయాలలో ఇతరులను బాధపెట్టే పొందవలసినదిగా ఉంటుంది.

ఈ విషయాన్ని పెరియవాచ్చాన్ పిళ్లై "భోగోపకరణంగళై కొండు పుక్కు స్థానోపకరణంగళై క్కొండు పుఱప్పడుమ్ విషయమ్" అని తెలియజేశారు.

శరీరంతో, ఇంద్రియాలతో పొందబడే సుఖం ఆ శరీరాన్ని ఆశ్రయించుకుని ఉండే ఆత్మకే తప్ప శరీరానికి కాదు, ఇంద్రియాలకు కాదు. నిత్యమై ఉండే ఆత్మయే శరీరంతో అనుభవించే అల్పానందాన్ని ఇచ్చే ఘటపటాది వస్తువులను చూడడం కోసం శరీరంలో రెండు కన్నులను కలిగి ఉన్నట్లే, నిత్యుడైన భగవంతుని పొంది, నిత్యమైన ఆత్మ నిత్యమైన మహానందాన్ని కలిగించే వస్తువులను దర్శించాలి అంటే, శాస్త్రాలు అనే జ్ఞాననేత్రాలనే పొందాలి.

అటువంటి శాస్త్రాలు సంస్కృతభాషలో ఆవిర్భవించిన నాలుగు వేదాలు, వాటి చివరి భాగాలైన వేదాంతాలు అనే పేరు పొందినవి, వీటి అర్థాలను స్పష్టం చేసేవి, ఉపబృంహణాలు అనే పేరుతో పిలువబడేవి అయిన ఇతిహాసపురాణాదులు, వాటి వ్యాఖ్యానాలు. వీటికి అన్నిటికి సంస్కృత వేదాంతాలు అనే పేరు ఏర్పడింది. వీటిని అన్నిటిని ఆత్మకు ఒక కన్ను అని పూర్వాచార్యులు నిర్ణయించారు.

శ్రియఃపతి అయిన భగవంతుని నిర్హేతుక కృపచేత "మయర్వఱ మదినలమ్" (కరుణాళువు అయిన భగవంతునిచే భ్రాంతి, విస్మృతి మొదలైన ఏ దోషాలు లేని, భక్తిగా పరిణమించిన జ్ఞానం) అనుగ్రహింపబడిన ఆళ్వారులు పది మందిలో ప్రధానులై, అవయవి ఐన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన నాలుగు దివ్య ప్రబంధాలు నాలుగు వేదవేదాంతాలుగాను, తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన ఆఱు దివ్యప్రబంధాలు అంగాలుగాను, మిగిలిన ఎనిమిదిమంది ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు ఉపబృంహణాలుగాను వ్యవహరింపబడుతున్నందున, సంస్కృతవేదాంతాలతో

సమానమైన నాలాయిర దివ్యప్రబంధాలు, వాటి అర్థాలను వివరించడం కోసం ఏర్పడిన వ్యాఖ్యానాలు, వాటిలోని చాలా అతిసూక్ష్మమైన అర్థాలను ఏర్చి కూర్చి రచింపబడిన రహస్యగ్రంథాలు, వాటి వ్యాఖ్యానాలు, పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రాలు, వాటి వ్యాఖ్యానాలు– అనే ఇవి అన్నీ ద్రావిడవేదాంతాలు అని పిలువబడుతున్నాయి. వీటిని అన్నిటిని ఆత్మకు వేరొక కన్ను అని పెద్దలు నిర్ణయించారు.

ఈ రెండు కన్నులతో మాత్రమే మనం

1) శ్రియఃపతి అయిన అయిన భగవంతుని,

2) అతని దరి చేరి నిలచి, అతనికి చేసే కైంకర్యరూపమైన ఫలాన్ని,

3) ఆ భగవంతునికే పరతంత్రమై, అతనికి శరీరమై, అతనిచేతనే ధరింపబడే స్వభావాన్ని కలిగినదై, భగవంతునికే శేషమై, జ్ఞానాన్ని కలిగిన ఆత్మయొక్క స్వరూపాన్ని ,

4)ఈ ఫలాన్ని పొందడానికి చేసే ఉపాయం అయిన భగవంతుడే అనే ఉపాయాన్ని,

5) ఆ భగవంతుడు అనే ఉపాయంతో అతని కైంకర్యాన్ని ఆత్మ చేసేటప్పుడు, దానిని చేయనీయకుండా అడ్డుపడే, కైంకర్యంలో అభినివేశం పొందినప్పుడు ఆటంకపరి విరోధులను తెలియడానికి వీలవుతుంది.

ఈ ఐదు విషయాలే అర్థ పంచకం అనబడుతున్నాయి.

అందుచేత, ఈ విధంగా, ఈ లోకంలో ఉండే అల్పసుఖం పొందడంకోసం బాహ్యవస్తువులను చూడడానికి ఏ విధంగా శరీరంలో ఉండే మాంసచక్షువులు రెండు కావాలో, ఆ విధంగానే, మహానందాన్ని ఇచ్చే వస్తువులను చూడడంకోసం కూడా రెండు కన్నులు కావాలి.

ఈ మాంసచక్షువులు జన్మవల్లనే కలుగుతున్నాయి. అయితే, శాస్త్రాలు అనే జ్ఞాననేత్రాలు ఒక తగిన ఆచార్యుని ఆశ్రయించే పొందవలసి ఉంటుంది.

ఒక ఆచార్యుని ఆశ్రయించి, క్రమానుసారంగా ఉపదేశాన్ని పొందకుండా, అచ్చు వేయబడిన శాస్త్రపుస్తకాలను, వాటి అనువాదాలను తమ మాంసచక్షువులను సాధనంగా చేసికొని తామే ప్రయత్నించి జ్ఞాననేత్రాలను పొందాలని చూచేవారు ఆ జ్ఞాననేత్రాలను ఏనాటికీ పొందలేరు.

నేత్రరోగాన్ని పోగొట్టుకోవడంకోసం తగిన నేత్రవైద్యుని దగ్గరకు వెళ్లకుండా, తామే స్వయంగా కంటి రోగాన్ని తీర్చుకోవాలని భావించి, నేత్రరోగాన్ని తీర్చే మందుల పట్టికను చూచి, తామే కంటిరోగాన్ని తీర్చుకోవాలని ప్రయత్నించే పాండిత్యం పొందినవారితో ఇటువంటివారు సమానులు అవుతారు.

ఉభయవేదాంతార్థాలను ఒక ఆచార్యుని సన్నిధిలో కానీ, పలువురు ఆచార్యుల సన్నిధిలో కానీ, సేవించి వినాలనే ఆశ లేనివారు, కేవలం అల్పానందానికి వశమైనవారుగానే కాలాన్ని గడపవచ్చు.అంతే. దానివల్ల ఏ విధమైన నిత్యమైన ఆనందం కాని, మనోనిబ్బరం కాని వారికి లభించదు. లోకంలో క్రమానుసారంగా అభ్యసించని ఏ విద్య అయినా ఉపయోగపడుతుందా?

చాలా చాలా సూక్ష్మమైనదై, ఇంద్రియాలకు అందనిదైన వస్తువు భగవంతుడు, జీవాత్మ. వాటిని తెలియజేసేవి వేదం మొదలైన శాస్త్రాలు మాత్రమే. వాటిని తానుగా అభ్యసించడం సులభం కాదు. తగిన ఆచార్యుని దగ్గరకు చేరి, పలు సంవత్సరాల పాటు పూర్ణంగా కాలాన్ని వినియోగించి, అభ్యసించిన తర్వాత, దానిని మననం చేసి, తరువాత పలుమార్లు ఇతరులకు చెప్పి, అలవాటు పడినవానికే ఆ యా సమయాలలో చాలా సందేహాలు కలుగుతాయి. వాటిని తనవంటి జ్ఞానం కలిగినవారి దగ్గర అడిగి విని,

ఇతర గ్రంథాలను పరిశీలించి, సందేహాలను తీర్చుకోవలసి ఉన్నది. తనకు తానే అభ్యసించినవారు ఏ విధంగా జ్ఞానంలో తేటపడడం సాధ్యమవుతుంది?

ఇటువంటి, ఆత్మకే మంచిని కలిగించే శాస్త్రాల అర్థాలను క్రమానుసారంగా అందరూ గ్రహించాలని ప్రయత్నించాలి తప్ప, తాముగానే తెలిసి పోవాలని ప్రయత్నించడం నిశ్చయంగా మంచిని కలిగించదు— అనేది నా అభిప్రాయం. ఈ విధంగా దాసుడు భావించి, ఈ విధంగా వ్రాయడాన్ని ఈ కాలంలోని నవీనులైన ఆచార్యులు మన్నిస్తారు గాక.

# ఆచార్య వైభవం

భగవంతుడుగాని, లేక ఆళ్వారులు గాని, ఎవరైనా ఈ లోకంలో అవతరిస్తే, వారి మహిమలు లోకంలో ఏ విధంగా తెలుస్తాయి? సంధి, సంకల్ప, అనువృత్తుల ద్వారా ఇవి తెలుస్తాయి. భగవంతుని అవతారాలు, లేక, ఆళ్వారుల అవతారాలు సంభవిస్తే, ఆ అవతారాలతో సంబంధం ఉన్నవారికి వాటి మహిమ తెలుస్తుంది? అంటే, సంధి విశేషంవల్ల తెలుస్తుంది, ఇది ఒక విధం. వారు తమ మహిమ ఎవరికి తెలియాలని అనుకుంటారో, అటువంటివారికే వారి మహిమ తెలుస్తుంది. ఇది సంకల్పం అనే రెండవ ప్రకారం. ఇక, అనువృత్తిద్వారా, అంటే, వారిని భావించి, ధ్యానించి, పూజించి, అనుసరించేవారికే వారి మహిమ తెలుస్తుంది. ఇది మూడవ ప్రకారం.

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు రాజ్యాన్ని చేస్తూ ఉండగా, ఆ శ్రీరామచంద్రుని నామాన్ని "రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః, రామ భూతం జగదభూత్ రామే రాజ్యం ప్రశాసతి" అయోధ్యలోని లక్షలాదిమంది జనులు చెప్పారని వాల్మీకి అన్నాడు. కానీ, కలియుగంలో అది సంభవించే విషయం కాదు. ఆ విధంగా భగవంతుని నామాన్ని ఈ కాలంలో లక్షలాదిమంది జనులు అనుసంధించేటట్లుగా చేయగలిగినవారు, చేసేవారు ఆచార్యులే. ఈ విధంగా భగవంతుని అవతారాల మహిమను ఆళ్వారుల అవతారాల మహిమను నిరంతరంగా, దీర్ఘంగా, గాఢంగా ప్రజలలోకి తీసికొని రావడానికి ఆచార్యావతారం ఆవశ్యకం. అందుచేత ఆచార్యావతారమే పూర్ణావతారం. దీనివల్లనే భగవంతుని వ్యాపారం పరిపూర్ణతను పొందుతున్నది.

"ఆసమంతాత్ చరతి, చారయతి ఇతి ఆచార్యః" అనేది ఒక విధమైన ఆచార్యపద వ్యుత్పత్తి. దీనికి పెద్దలు చాలా విధాలుగా అర్థాలను తెలియజేస్తున్నారు. భగవంతుని అవతారాలు ఆళ్వారుల అవతారాలు సంభవించి పూర్తి అయిన తరువాత కూడా చాలా కాలం వరకు వాటిని అంతటా లోకంలో అనుస్మృతిరూపంగా,

దీర్ఘస్మృతిరూపంగా వ్యాపింపచేసి, వాటి మహిమను అందరికీ తెలియజేస్తున్నారు కనుక, ఆచార్యులు అనబడుతున్నారు– అని ఒక ఆచార్యపద వివరణం. "జ్ఞానోపాయేషు నిరంకుశతయా ఆ సమంతాత్ సంచరంతీతి ఆచార్యాః". ఏ జ్ఞానోపాయాలు ఉన్నా, వాటిలో నిరంకుశంగా సంచరిస్తారు కనుక, ఆచార్యులు అనబడుతున్నారు. మనలో ఒక సంశయం ఉంటుంది, ఆక్షేపం ఉంటుంది, భీతి ఉంటుంది. కుమతి ఉంటుంది, విహతి ఉంటుంది, అరుచి ఉంటుంది, ద్వేషం ఉంటుంది. ఇటువంటి దోషాలన్నీ మనలో ఉంటాయి. ఈ దోషాలను అన్నిటినీ తొలగించే సామర్థ్యం ఆచార్యులకే ఉంటుంది. అంతే కాదు, " మరువి త్తొழும் మనమే తందాయ్, ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్" (నాకు నిన్ను ఆదరించి కొలిచే మనసును ఇచ్చావు, నా మనసులోని దోషాలను పోగొట్టావు) అనే విధంగా మనలో ఉండే ప్రతికూలమైన విషయాలను తొలగించడమే కాక, మనకు అనుకూలమైన ప్రవృత్తులను కూడా కలుగజేస్తారు. ఉద్బోధనం, ప్రేరణం, మార్గదర్శనం మొదలైనవానిని చేసి, మనలను ముందుకు తీసుకుని వెళతారు. అందువలన వారికి ఆచార్యులు అని పేరు. ఇంకొక విషయం ఏమంటే, "నిరంకుశతయా సర్వత్ర చరంతి ఇతి ఆచార్యాః". అనీశుడు, ఈశుడు, శ్రీ అనే ముగ్గురిలో అనీశుడు జీవుడు, ఈశుడు భగవంతుడు, శ్రీ అంటే పిరాట్టి, లక్ష్మి అనే ఈ ఈ ముగ్గురిలోనూ ఆచార్యులు సంచరిస్తున్నారు. ఏ విధంగా అంటే, జీవులలో ఉండే అన్ని విధాలయిన దోషాలను తొలగించి, వారికి సద్బుద్ధిని సద్భావనను కలిగించి, వారిని సంస్కరించే శక్తి ఆచార్యులకు ఉన్నది. ఆ విధంగానే, లక్ష్మిదగ్గర ఉండే పురుషకారాన్ని పుష్కలంగా పెంపొందించి, ఫలించేటట్లు చేసే సామర్థ్యం ఆచార్యులకు ఉన్నది. భగవంతుని దగ్గరకు వెళ్లి, ఆ స్వామిని నిర్బంధించి అయినా, కార్యాన్ని సఫలం చేసే శక్తి ఆచార్యులకు ఉన్నది. ఈ విధంగా జీవుల దగ్గరకు, లక్ష్మి దగ్గరకు, భగవంతుని దగ్గరకు వెళ్లి, కార్యాన్ని సాధించగలిగిన శక్తి ఆచార్యులకు ఉన్నందున, "ఆసమంతాత్ చరంతి" కనుక ఆచార్యులు. "న నమామి" అనే జీవుని, "న క్షమామి" అనే ఈశ్వరుని కూడా మార్చగలరు, ఆచార్యులు.

ఇంకా ఆచార్యుల శక్తి ఎక్కడ ఎక్కడ ప్రసరించి పనిచేస్తున్నది? అంటే, షట్ నిర్ణయం అని ఒకటి ఉన్నది. మన విధి, మన పాప వాసనలు, ఇప్పుడు మనం చేసే పాపాలు అని మూడు, ఆ విధంగానే, భగవంతుని దయ, మన పుణ్యపాపాలకు తగిన విధంగా అతడు ఫలాన్ని ఇచ్చే ఒక నియమం, అందరినీ ఉద్ధరింప చేయాలని అతని దీక్ష అనే మూడు– ఈ విధంగా మొత్తం ఈ ఆరు విషయాల మధ్య జరిగే ఘర్షణ రూపమే మన జీవితం. ఈ ఆరు విషయాల మధ్య నిరంతరం పోరాటం జరుగుతూనే ఉంటుంది. ఆచార్యుడు "సర్వత్ర ఆసమంతాత్ చరతి ఇతి ఆచార్యః అనే రీతిలో అంతటా సంచరిస్తాడు కనుక, ఈ ఆరింటిలో తగిన విధంగా సమన్వయాన్ని సాధించి, మనలను తరింప చేసేవాడు ఆచార్యుడు, ఈ ఆరు విషయాల మధ్య జరిగే పోరాటాన్ని శమింప జేసి, మన ఉజ్జీవనాన్ని సాధించగలిగిన శక్తిని కలవాడు, ఆచార్యుడు. ఆత్మోద్ధారణ మార్గాన్ని చూపగలిగినవాడు ఆచార్యుడు.

ఇంతేకాదు, భగవంతుడు అంతటా వ్యాపించగలిగిన శక్తిని కలవాడు– అని పేరు గలవాడు. యచ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతే ఽ పి వా అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః "అని కదా, కీర్తింపబడుతున్నాడు. అయినప్పటికీ, అతడు కొంతమందిని, అంటే తీవ్రమైన, అసహ్యమైన అపచారాలను చేసిన వారి క్షమించడానికి రక్షించడానికి ఇష్టపడడు. "న క్షమామి, క్షిపామి "అంటాడు కదా. ఆ విధంగా భగవంతుని రక్షణ శక్తి ప్రవేశించలేని వారినికూడా, భగవంతునకు ఇష్టం కానివారిని కూడా సంస్కరించి వారిని రక్షించే శక్తిని కలవాడు, ఆచార్యుడు. అందువల్ల భగవంతుని శక్తి చరించలేని చోట్లలో కూడా ఆచార్యశక్తి సంచరించగలదు. కనుక," ఆ సమంతాత్ చరతి" అంతటా చరించేవాడు కనుక ఆచార్యుడు అవుతున్నాడు. తాను ఎన్నో అవతారాలు ఎత్తినా భగవంతుడు సంస్కరించలేని, ఏష మే సహజో దోషః స్వభావో దురతిక్రమః" అనే రీతిలోని వారినికూడా ఆచార్యుడు సంస్కరించి బాగుచేస్తున్నాడు. అటువంటివారికి కూడా ఆచార్యానుగ్రహం ఉంటే, వారిలో క్రాంతి కలుగుతుంది.

ఈ విధంగా అయితే, భగవంతునకు తక్కువదనం చెప్పినట్లు కాదా! అని అంటే ఆ విధంగా కాదు. పైన తెలిపిన విధంగా ఆచార్యుడు ఎవరినైనా సంస్కరించగలిగిన శక్తిని కలిగి ఉండడం కూడా భగవంతుని అమోఘ సంకల్పం వల్లనే. అందుచేత ఇది కూడా భగవంతుని అతిశయంలోకే పర్యవసిస్తుంది. ఇది రత్నప్రభా న్యాయంతో, పుష్ప పరిమళ న్యాయంతో సమన్వయం చేసుకోవాలి. రత్నానికి, దానికి కల కాంతి వల్ల అతిశయం కలిగినా, ఆ రత్నానికి సహజంగా ఉండే గొప్పతనానికి ఏ లోటు రాదు. పువ్వుకు, దానికి ఉండే పరిమళం వల్ల గొప్పతనం కలిగినా, సహజంగా పుష్పానికి ఉండే గొప్పతనానికి ఈ లోటు లేదు. ఆ విధంగానే, భగవంతుడు ఎన్ని అవతారాలను ఎత్తినా సాధించలేని సర్వజనాభ్యుదయాన్ని ఆచార్యుడు సాధించడం అనేది కూడా ఆ భగవంతుని మొక్కవోని సంకల్పం వల్లనే కనుక, ఇది కూడా భగవంతుని అతిశయంలోకే చేరుతుంది. ఆచార్య శక్తి అంటే, ఒక విశిష్టమైన, విలక్షణమైన భగవచ్ఛక్తియే. సర్వోద్ధారక భగవచ్ఛక్తి విశేషమే ఆచార్యశక్తి. అందువల్ల ఆచార్యుడు అంటే దేవతా విశేషమే. అందువల్లనే ఆచార్యుని నృసింహ రూపంతో పోల్చారు.

ఇక్కడ ఇంకొక విషయాన్ని కూడా మనం గుర్తుపెట్టుకోవాలి. లోకంలో మనం ఈ ఆచార్య పదాన్ని ఉపకారకాచార్యుల, ఉత్తరకాచార్యుల విషయంలోనే కాక. సామాన్య శాస్త్రాలను సామాన్య కళలను నేర్పించే వ్యక్తుల విషయంలో కూడా వాడుతున్నాము. ఇటువంటి సామాన్య వ్యక్తుల విషయంలో వ్యవహరించే ఆచార్యపదవ్యవహారం గౌణమని, ఔపచారికమని అనాలి. సోపానమని, ప్రాప్తి స్థానమని లోకంలో రెండు విషయాలు ఉన్నాయి. సోపానం అంటే– మెట్టు. ప్రాప్తి స్థానం అంటే– గమ్యం చేరవలసిన చోటు. సోపానం అనేది ప్రాప్తి స్థానాన్ని చేరడానికి సాధనం అవుతున్నది. సామాన్య విద్యను నేర్పించేవారికి మరి ఆచార్యత్వం ఉండదా? అంటే, పూర్తిగా ఉండదని అనడం లేదు వారిలో ఈ ఆచార్యత్వం అనేది లవలేశంగా ఉంటుంది. అందుచేత అది ఔపచారికం, గౌణం. వాస్తవంగా మనకు ఆత్మక్షేమాన్ని కలిగించే జ్ఞానాన్ని ఎవరు

ఉపదేశిస్తారో, వారే ఆచార్యులు అనబడతారు. వారికే భగవంతుని సమీపంలో మన కోసం పురుషకారాన్ని చేయగలిగిన సామర్థ్యాన్ని, శక్తిని కలవారై ఉంటారు. భగవంతునితో అత్యంత సన్నిహిత సంబంధాన్ని కలిగి ఉంటారు. భగవంతునకు ఇష్టులైన మహాత్ములై ఉంటారు. వీరే ప్రాప్తిస్థానానికి మనలను చేర్చగలిగినవారు.

# శ్రీరామానుజ సిద్ధాంతం– శ్రీవేంకటేశ్వరుడు

(న్యాయవేదాంతవిద్వాన్, శ్రీవైష్ణవసింహ ఉ. వే. శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యస్వామి (తిరుపతి) అనుగ్రహించిన ద్రావిడవ్యాసం ఆధారంగా)

విశిష్టాద్వైతసిద్ధాంతం వేదంలో చెప్పబడినది కనుక, అనాది అయినది. అది కొన్ని కొన్ని కాలాలలో అంతర్ధానమైనా, ఆ యా సమయాలలో అవతరించిన ఆళ్వారులవల్ల, ఆచార్యులవల్ల మళ్ళీ వ్యక్తమైనది, ఆళ్వారులలో ముఖ్యులు నమ్మాళ్వారులు, ఆచార్యులలో ముఖ్యులు భగవద్రామానుజులు. ఈ ఇద్దరిచేత తమ తమ అవతారసమయాలలో ఈ సంప్రదాయం విశేషంగా ప్రచారం చేయబడింది.

ఆళ్వారులు మిక్కిలిగా అభిమానించిన 108 దివ్య క్షేత్రాలలో కోయిల్ అనే శ్రీరంగం, తిరుమలై అనే వేంకటచలం, పెరుమాళ్ కోయిల్ అనే హస్తిగిరి అనే మూడు గొప్పవి– అని భావింపబడుతున్నాయి. ఆళ్వారులు అందరిచే మంగళాశాసనం చేయబడిన కారణంచేత కోయిల్ అనబడే శ్రీరంగం ప్రాధాన్యాన్ని పొందింది. తొండరడిపొడి ఆళ్వార్లు ఒక్కరు తప్ప, మిగిలిన ఆళ్వారులు అందరికీ అందరిచే మంగళాశాసనం చేయబడిన కారణంచేత తిరుమలై తరువాతి స్థానాన్ని పొందింది. పూర్వం ఒకానొక సమయంలో శ్రీరంగంలో ఉండే అరైయర్ ఒకరు ఈ తిరుమలైకు వచ్చినప్పుడు, ఇక్కడ ఉండేవారు ఇయల్ ను గానం చేయమని వారిని. ప్రార్థించారట. వారు తమ అలవాటు ప్రకారం "పదిన్మర్ పాడుమ్ పెరుమాళ్ " అని శ్రీవేంకటేశ్వరునకు బిరుదును ఊది, ఇయల్ పాడడం ఆరంభించారట. అప్పుడు అక్కడ ఉండేవారు "ఈ బిరుదు నంబెరుమాళ్ ఒక్కరికే తగినది. చోళుడు, అంటే, తొండరడి ప్పొడి అళ్వార్లు పాడనందున, శ్రీతిరువేంగడముడైయాన్ కు ఆ బిరుదు చేరదు" అని అన్నారట. ఈ ఐతిహ్యం శ్రీవైష్ణవదివ్యక్షేత్రాలలో శ్రీరంగం మొదటిది, తిరుమలై రెండవది– అనే విషయంలో స్పష్టతను కలిగిస్తున్నది కదా.

ఒక విధంగా చూస్తే, ఈ తిరుమలైయే మొదటిది– అని చెప్పవచ్చు. తిరుప్పాణ్ ఆళ్వార్లు లోకసారంగమహాముని భుజాలలో వేంచేసి, శ్రీరంగనాథుని పాదాదికేశాంతంగా దర్శించి, ఆనందించి, అమలనాదిపిరాన్ అనే ప్రబంధాన్ని గానం చేశారు. ఆ ప్రబంధంలో చివర "అండర్ కోన్ అణి అరంగన్ ఎన్నముదినై క్కండ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే" (బ్రహ్మాండాధిపతి, అందమైన శ్రీరంగంలో వేంచేసి ఉన్నవాడు, నాకు అమృతంవంటివాడైన స్వామిని దర్శించిన నా నేత్రాలు ఇక దేనిని దర్శించవు) అని అన్నందున శ్రీరంగనాథుని సూచించిన కన్నులతో ఇంకొకరిని చూడని ఆ అళ్వార్లు ప్రతివ్రత– అని చెప్పదగినవారు. తొండరడిప్పొడి ఆళ్వార్ కూడా అటువంటివారే. అటువంటి తిరుప్పాణ్ ఆళ్వార్లు కూడా "విణ్ణవర్ కోన్ విరైయార్ పొழిల్ వేంగడవన్" (పరమపదనాథుడు, సువాసన నిండుగా కలిగిన తోటలను కల వేంకటాచలంలో ఉండే స్వామి) అని మొదటి పాశురంలోను," "మంది పాయ్ వడవేంగడ మామలై వానవర్ గళ్ శంది శెయ్య నిన్ఱాన్ అరంగత్తరవినణైయాన్ " (ఆడ కోతులు సంచరించే, ఉత్తరదిక్కులో ఉండే వేంకటాచలంలో నిత్యసూరులు ఆరాధన చేయగా నిలచి ఉండే స్వామియే శ్రీరంగంలో ఆదిశేషుని శయనంగా కలిగిన శ్రీరంగనాథుడు) అని మూడవ పాశురంలోనూ వేంకటాద్రినాథుని పాడారు. అక్కడ పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని గమనిస్తే, శ్రీవైకుంఠంనుండి భగవంతుడు కిందకి దిగి వచ్చేటప్పుడు, మొదట తిరుమలైలో శ్రీవేంకటేశ్వరుడై నిలచి, తరువాత శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించాడు– అని తెలుస్తున్నది. దీనివల్ల మొదట తిరుమలైలో నిలచిన కారణంచేత, తిరుమలైయే మొదటి స్థానం పొందుతున్నది– అని చెప్పడానికి ఏ అడ్డు లేదు కదా. పైన ప్రస్తావించిన అమలనాదిపిరాన్ పాశురభాగాలనుండి శ్రీరంగనాథుడు, శ్రీవేంకటాచలప్రభువు ఒకే వ్యక్తి అని స్పష్టమవుతున్నందున, తొండరడిప్పొడి ఆళ్వార్ భక్తిలోని అతిశయంచేత శ్రీరంగనాథునే పాడినవారైనా, శ్రీవేంకటాద్రినాథునికూడా పాడినవారే అవుతున్నారు. "పేశిఱ్ఱే పేశల్" అనే విధంగా ఒకరు చెప్పిన మాటనే ఇంకొకరు చెప్పే ఐకకంఠ్యాన్ని కలిగినవారు కదా, ఈ ఆళ్వారులు. అందుచేత, ఒక కోణంలో చూస్తే, తిరుమలై ప్రాధాన్యాన్ని పొందుతుంది– అనేది నిశ్చయించుకోవచ్చు.

నమ్మాళ్వారులు, శ్రీరామానుజులు,ఈ ఇద్దరూ, ఈ తిరుమలైలో చాలా అభినివేశాన్ని కలవారై, సిద్ధాంతాన్ని వ్యక్తం చేశారు. నమ్మాళ్వారులు "కంగులుంమ్ పగలుమ్" అనే దశకాన్ని శ్రీరంగనాథుని విషయంగా అనుగ్రహించారు. అందులో వారికి అళ్వారుల దశలో అనుభవం కలగలేదు. తమ ప్రేమ అతిశయించగా, ఒక నాయకీభావాన్ని పొంది పలకాలి– అని వారు చూశారు. తమ దుఃఖాన్నిగూర్చి తాము కూడా పలుకలేని అవధిలోని దుఃఖాతిశయిం వారికి ఏర్పడినందున, నాయిక తల్లి పాశురంగా పాశురాలను పాడారు. ఆ దశకానికి అర్థాన్ని చెప్పేటప్పుడు అంతా శ్రీపరాశర భట్టర్ "నమ్మాళ్వారుల ప్రావణ్యంవంటి ప్రావణ్యం మనకు లేనందువల్ల, వారి స్థితిని మనం తెలియడం సాధ్యం కాదు. అందుచేత ఈ దశకానికి మేము ఏ విధంగా అర్థాన్ని చెప్పగలము?" అని తలపై చేయి పెట్టుకొని ఉండేవారట. ఈ ఐతిహ్యం ఆళ్వారుల ప్రావణ్యం అవధి లేనిది– అని, తమను తాము మరిచిపోయే స్థితిని వారు పొందడాన్ని తెలుపుతున్నది కదా.

ఇక శ్రీవేంకటేశ్వరుని విషయంలో నమ్మాళ్వార్లు నాయికాభావంలో కాకుండా, ఆళ్వారుల భావనలోనే శాస్త్రార్థాలను వ్యక్తం చేసి అనుభవించిన స్థితిని గమనించవచ్చు. ద్వయం అనే మంత్రంలోని మొదటి భాగంలో చెప్పబడినది శరణాగతి. అంటే, లక్ష్మీదేవిని పురస్కరించుకుని భగవంతుని శ్రీచరణాలను శరణంగా ఆశ్రయించడం. రెండవ భాగంలోని అర్థం ఏమంటే, ఆ దివ్య దంపతుల చెరికలో కైంకర్యాన్ని ప్రార్థించడం. ఈ శరణాగతిని కైంకర్యప్రార్థనను క్రమంగా "అగలకిల్లేన్" అనే పాశురంలోను, "ఒழிవిల్ కాలమ్" అనే పాశురంలో నమ్మాళ్వారులు శ్రీ వేంకటేశ్వరుని విషయంలో అనుసంధించారు. "మాఱన్ అడి పణిందు ఉయ్ న్దవన్" (నమ్మాళ్వారుల శ్రీచరణాలను సేవించి, ఉజ్జీవించినవారు అయిన శ్రీరామానుజులు కూడా శ్రీభాష్యం ఆరంభంలో "బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా" (పరమాత్మ అయిన శ్రీనివాసుని విషయంగా నాకు భక్తిరూపాన్ని పొందిన జ్ఞానం కలగాలి) అని

బ్రహ్మశబ్దంలోని అర్థమైన శ్రీ అలర్ మేల్ మంగై ఉఱై మార్బన్ విషయంలో తమకు భక్తి కలగాలి– అని ప్రార్థించారు. వేదార్థసంగ్రహం అనే ప్రసిద్ధమైన గ్రంథం శ్రీవేంకటేశ్వరుని సమక్షంలో శ్రీరామానుజులు చేసిన ఉపన్యాసమే. ఈ విధంగా ఆళ్వారులు, శ్రీరామానుజులు చాలా అభిమానించిన స్థానం అయినందున, శ్రీరంగం కంటే ఆదరించదగిన చోటు తిరుమలై– అని అన్నట్లు అయినది. దీనివల్ల శ్రీరంగానికి కొరత ఏమీ ఏర్పడదు. న హి నిందా న్యాయాన్ని ఇక్కడ భావించాలి. ఆచార్యరుచిపరిగ్రృహీతమైన అర్థమే ఈ ఆత్మకు రక్షకం –అని అంటారు, పెద్దలు. శ్రీకృష్ణుడు ధర్మపుత్రుని భీష్ముని దగ్గర ధర్మోపదేశం పొందమని ప్రేరేపించినట్లు, ధర్మపుత్రుడు భీష్ముని సమీపించి, " కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః" (ఉన్నతమైన ధర్మంగా నీవు దేనిని భావిస్తున్నావు?) అని అడిగినట్లు, దానికి భీష్ముడు సమాధానంగా "ఏష మే సర్వధర్మాణాం ధర్మో ఽ ధికతమో మతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చేత్ నరః సదా" (పుండరీకాక్షుడైన శ్రీమన్నారాయణుని పూజించడమే గొప్ప ధర్మమని నేను భావిస్తున్నాను) అని పలికినట్లు సహస్రనామస్తోత్రం పూర్వపీఠికలో చెప్పబడే ఐతిహ్యాన్ని పురస్కరించుకొని దీనిని తెలియవచ్చు. వేదపురుషుడు, నమ్మాళ్వారులు, భగవద్రామానుజులు– అనే ఆచార్యులు ఏ అర్థాన్ని అభిమానించి, అనుష్ఠించారో, ఆ అర్థమే మనం కూడా అభిమానించి, ఆదరించి, అనుష్ఠించడం తగినది– అని అనడంలో ఏ అడ్డు లేదు కదా. దానిని కొంచెం చూద్దాం.

వేదపురుషుడు " ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని మొదలైన వేదవాక్యాలతో మోక్షోపాయంగా భక్తిని విధించాడు. "ముముక్షు ర్వై శరణమహం ప్రపద్యే "అనే వాక్యంతో ప్రపత్తినే అనుష్ఠించాడు. నమ్మాళ్వార్లుకూడా తమ ప్రబంధాలలో "భక్తిని కలిగి ఉండాలి"– అని పలుచోట్ల ఉపదేశించి, " అగలగిల్లేన్" అనే పాశురంతో శరణాగతినే ఆశతో అనుష్ఠించారు. భగవద్రామానుజులు కూడా, దీనిని అనుసరించి, శ్రీభాష్యంలో పలుచోట్ల భక్తిని విధించి, గద్యత్రయం ద్వారా ప్రపత్తిని తాము అభిమానించి, అనుష్ఠించారు. ఈ ముగ్గురు భక్తిని ఉపదేశించినవారే తప్ప,

అనుష్ఠించినది ప్రపత్తినే కనుక, భక్తిప్రపత్తులలో, ప్రపత్తియే గొప్పది. అదే మనచే అభిమానించి, అనుసరించదగినది. అటువంటి ప్రపత్తికి ఫలం కైంకర్యమే అవుతున్న ది— అనేది విశిష్టద్వైత మతసిద్ధాంతం.

ఇక, శ్రీవేంకటేశ్వరుని విషయంలో నమ్మాళ్వారులు అభినివేశాన్ని పొంది, ఉపాయోపేయనిష్కర్షం చేసిన విషయాన్ని కొంచెం వివరిస్తాను. లక్ష్మణుడు శ్రీరాముని విషయంలో "అహం సర్వం కరిష్యామి"— నేను అన్ని సేవలను చేస్తాను— అని ప్రతిజ్ఞ చేశాడు. సీతాదేవిని ముందుంచుకొని శ్రీరాముని కైంకర్యం కోసం శరణు పొందాడు. నమ్మాళ్వార్లుకూడా శ్రీవేంకటేశ్వరుని విషయంలో కైంకర్యాన్ని చేయాలి— అని ఆశపడ్డారు. పద్మావతీదేవి పురుషకారంతో శ్రీవేంకటేశ్వరుని శరణు పొందారు. అయినా, శ్రీలక్ష్మణ స్వామి కంటే నమ్మాళ్వార్లు చాలా గొప్పవారు. ఏ విధంగా అంటే—

"అన్నీ తెలుసు" అనేదానికంటే, "తెలియనిది ఏదీ లేదు" అనేదికదా గొప్పది. లక్ష్మణుడు "నీవు ఆజ్ఞాపించిన దానిని అంతటినీ చేస్తాను" అని అన్నాడే తప్ప, శ్రీరాముని "అరణ్యానికి రావద్దు" అనే మాటను వినలేదు అందుచేత, "అన్ని చేస్తాను" అన్నది "అన్నీ తెలుసు" అనే విధంగా తక్కువదే. ఇక, "తెలియనిది ఏదీ లేదు " అన్నట్లుగా ఉన్నతమైనది ఆళ్వారుల ఆశ. ".వழువిలా వడిమై శెయ్య వేండుమ్ నామ్" (ఏ ఆటంకం లేని కైంకర్యాన్ని నేను చేయాలి) అని "సేవ చేయడంలో ఏ లోటు లేకుండా చేయాలి" అనే ఆళ్వారుల వాక్కు " పొయ్యిల్ పాడల్" (అబద్ధం కాని వచనం) కనుక, " తెలియనిది ఏమీ లేదు" అనే విధంగా "అళ్వార్లు చేయని కైంకర్యం లేదు" అనేది వ్యక్తమవుతున్నందున, ఆళ్వారుల వాక్కు ఉన్నతమైనది కదా.

ఇక, ఆళ్వార్లు " అగలగిల్లేన్" అనే పాశురంలో అనుసంధించిన అర్థాన్ని కొంచెం అనుభవిద్దాం. ఆ అర్థమే శరణాగతి అనే ప్రపత్తి. లక్ష్మీదేవిని పురుషకారంగా చేసికొని, గుణపూర్తిని కలిగిన శ్రీవేంకటేశ్వరుని ఆళ్వార్లు తమ అనన్యశరణత్వాన్ని వ్యక్తం చేస్తూ శరణు పొందారు— అనేది ఈ పాశురంతో వ్యక్తమవుతున్న ది. " "అగలకిల్లేన్

ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మంగై ఉఱై మార్బా!" అనే మొదటి పాదంలో పద్మావతీదేవిని పురుషకారంగా ఆశ్రయించారు. ఆమెవల్లనే ఫలపూర్తి అవుతుంది. మోక్షం మనకు లభించాలి అంటే, దానికి నాలుగు కారణాలు తప్పకుండా ఉండాలి– అని అంటారు. అవి ఏవి? అంటే, శరీరం, ఆత్మ, సర్వేశ్వరుడు, లక్ష్మీదేవి– అనేవి. వరాహస్వామి భూదేవికి ఉపదేశించేటప్పుడు, "శరీరే సతి సుస్వస్థే" అని శరీరాన్ని ఫలానికి ఉపాయంగా తెలియజేశాడు. తనను తాను కాపాడుకునే ప్రయత్నంనుండి విరమించిన , నివృత్తుడైన, ఆత్మ కారణం అనేది తిరుమంత్రంలోని "నమః" అనే పదంద్వారా తెలుస్తున్నది. " అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి "అనే చరమశ్లోకం వల్ల సర్వేశ్వరుడైన తాను కారణం అనేదానిని శ్రీకృష్ణుడే అనుగ్రహించాడు. ఇక, లక్ష్మీదేవి పురుషకారం అయితే తప్ప సర్వేశ్వరుడు కార్యం చేయడు– అని ద్వయమంత్రంలో తెలుస్తున్నందున, ఆమెవల్లనే కార్యం పూర్తి అవుతుంది– అని తెలుస్తున్నది. అందువల్లనే అళ్వార్లు పద్మావతీదేవిని మొదటి పాదంలో ఆశ్రయిస్తున్నారు.

లక్ష్మీదేవి సన్నిధి ఉంటేనే, మన కార్యం సఫలం అవుతుంది– అనే విషయం రావణుడు, కాకాసురుడు– అనే ఇద్దరి వృత్తాంతాలను చూస్తేమనకు తెలుస్తుంది. రావణుడు శాపభయంచేత సీత వద్ద చేయరాని చేష్టలను చేయలేదు. కానీ, కాకాసురుడు చాలా పెద్ద ,సహించలేని అపచారాన్ని సీతాదేవిపట్ల చేశాడు. రావణుడు మొదటినాడు జరిగిన యుద్ధంలో "చచాల చాపం చ ముమోచ వీరః"(యుద్ధంలో శ్రీరాముని బాణాల తాకిడివల్ల వీరుడైన ఆ రావణుడు చలించిపోయాడు, విల్లునుకూడా విడచిపెట్టాడు) అనే విధంగా చేష్టలుడిగి నిలుచున్నాడు. ఆ విధంగానే, కాకాసురుడుకూడా "త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః" (మూడు లోకాలను మాటిమాటికి చుట్టి, చివరికి ఆ రాముని శరణు పొందాడు) అనే విధంగా శ్రీరాముని సమక్షంలో చేష్టలుడిగిపడ్డాడు. అతడు చేష్టలుడిగిన స్థితిని చూచి శ్రీరాముడు రక్షించినందువల్ల, ఈ ఇద్దరినీ కాపాడి ఉండాలి, లేక, ఇద్దరినీ దండించి ఉండాలి. కానీ,

దానికి మారుగా, కాకాసురుని కంటే పాపం తక్కువ చేసిన రావణుని వధించడం, రావణుని కంటే మహాపాపి అయిన కాకాసురుని రక్షించడం ఎందుకు? అని అడిగినవారికి, రావణుడు చేష్టలుడిగి ఉన్నప్పుడు సీతాదేవి సమక్షంలో లేకపోవడం, కాకాసురుడు నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు సీతాదేవి సమీపంలో ఉండడమే రావణుడు వధింపబడడానికి, కాకాసురుడు ప్రాణాలు దక్కించుకోవడానికి క్రమంగా కారణాలు– అని మన పూర్వాచార్యులు అనుగ్రహించిన సూక్తి మనకు సమాధానాన్ని స్పష్టం చేస్తున్నది. "లక్ష్మీదేవి వచనాన్ని భగవంతుడు వింటాడా? అతడు ఎవరికి వశం కాని స్వతంత్రుడు కదా! "అని ఇంకా సందేహ పడేవారికి ఒక విషయాన్ని చెప్పి, వారి సందేహాన్ని నివృత్తి చేయవచ్చు. అది ఏమి? అంటే, రావణవధ జరిగిన తరువాత, హనుమంతుడు సీత దగ్గరకు వెళ్ళి, "నిన్ను ఇంతకాలంగా బాధించిన ఈ రాక్షసస్త్రీలను వధించడానికి నాకు అనుమతిని ఇవ్వాలి" అని అడిగినప్పుడు, " వీరి విషయంలో నీవు దయను కలిగి ఉండాలి, లోకంలో ఎవరు తప్పు చేయలేదు?" అని అంటూ హనుమంతుని మనసును మార్చి, అతడు రాక్షసస్త్రీలను సహించేటట్లు చేసింది కదా. పట్టిన పట్టును విడవని వానరజాతిలో జన్మించిన హనుమంతునికూడా సహించేటట్లు చేయగలిగిన లక్ష్మీదేవి, తన మాటను అడ్డుపెట్టని, జవదాటని భగవంతుని మనసును మార్చి, మన కార్యం చేయలేదా!– అనేదే ఆ విషయం.

అవతార కాలంలో భగవంతునితో లక్ష్మీదేవికి కొంచెం సమయం విశ్లేషం అనేది కలిగినప్పటికీ, శ్రీవేంకటేశ్వరుని వక్షఃస్థలంలో నిత్యావాసం చేస్తూ, ఏ నాడూ ఆ స్వామిని విడవకుండా పద్మావతీదేవి ఉన్నందున, తమ ప్రాప్యం తప్పదు– అని ఆళ్వార్లు అభిప్రాయపడ్డారు. ఆ విధంగా తాము ఆశ్రయించిన పురుషకారబలంచేత భగవంతునిలో తల ఎత్తే వాత్సల్యం, స్వామిత్వం, సౌశీల్యం సౌలభ్యం (దోషాన్ని గుణంగా గ్రహించే స్వభావం, స్వామియై ఉండడం, తక్కువవారితో ఏ తేడా లేకుండా కలసి మెలసి వర్తించడం, మాంసచక్షువులకు కూడా గోచరించే స్వభావం) అనే నాలుగు గుణాలను " నిగరిల్ పుగ*ழா*య్, ఉలగమ్ మూన్టుడైయాయ్, ఎన్నై యాళ్వానే, నిగరిల్ అమరర్

మునిక్కణంగళ్ విరుంబుమ్ తిరవేంగడత్తానే" అని వరుసగా నాలుగు సంబోధనలను కల పాశురంలోని రెండు, మూడు పాదాల ద్వారా తెలియజేశారు. " పుగల్ ఒన్టిల్లా అడియేన్ ఉన్నడిక్కీழ் అమర్ న్దు పుగుందేనే" (ఏ ఆశ్రయం లేని, దాసుడైన నేను నీ పాదాల కింద అమరి ఉండి, శరణాగతి చేస్తున్నాను) అనే నాలుగవ పాదంతో అటువంటి గుణాలను కల శ్రీవేంకటేశ్వరుని పాదాల కింద చెంత చేరి, శరణు పొందుతున్నారు.

ఆత్మైక్యజ్ఞానంతో మోక్షం కలుగుతుంది– అని అంటారు, అద్వైతులు. "భగవంతుడే రక్షకం" అని ఆశ్రయిస్తే, అతడు అనుగ్రహిస్తాడు –అని అంటారు, విశిష్టాద్వైతులు. ఈ విధంగా పరమాచార్యులైన నమ్మాళ్వారులు ఈ తిరుమలైలో వేంచేసి ఉండే పరతత్వమైన శ్రీ వేంకటేశ్వరుని విషయంలో అభినివేశాన్ని పొంది, "అకలకిల్లేన్", " ఒழివిల్ కాలమ్" అనే దశకాలలో క్రమంగా శరణాగతిని, కైంకర్యప్రార్ధనను చేసి, ఉపాయోపేయనిష్కర్షాన్ని చేసినవారయ్యారు. ఈ విధంగా కైంకర్యమే మోక్షమని, దానికి భగవంతుడే శరణం అనే భగవద్రామానుజ సిద్ధాంతం అని చెప్పబడే విశిష్టాద్వైత సిద్ధాంతం శ్రీవేంకటేశ్వరుని విషయంలో అన్వయించి, కొంచెం విజ్ఞాపింపబడింది.

